ఈ సంపుటిలో :

వెలుగుండగానే - ఇల్లు చక్కబెట్టుకోవాలి,

తార్తారులు తెచ్చిన ఖైదీ

— .... —

# వెలుగుండగానే ఇల్లు చక్కబెట్టుకోవాలి

క్రీస్తు పుట్టిన తరువాత వంద సంవత్సరాలకు రోమన్ చక్రవర్తి ట్రాజాన్ పరిపాలించే రోజుల్లో జరిగింది ఈకథ. అప్పటికి జీసస్ శిష్యులు ఇంకా సజీవులైఉన్నారు. క్రైస్తవులు క్రీస్తు చెప్పిన ధర్మాలు తు. చ. తప్పకుండా అనుసరిస్తున్నారు. ధర్మాల్లో ఇలా చెప్పబడి ఉంది. 'జీసస్‌లో విశ్వసించే వారందరిదీ ఒకే హృదయం. ఒకే ఆత్మ. ఏ వ్యక్తీ తన సంపత్తి తన స్వంతం అనేవాడు కాదు. అందరూ కలిసి అనుభవించేవారు. ఏసు శిష్యులు తమ ఉజ్వల శక్తితో జీసస్ పునరుద్ధానాన్ని గురించి సాక్ష్యమిచ్చారు. వారిలో ఎవరికీ లోటు ఉండేది కాదు. భూములూ ఇళ్ళూ ఉన్నవారు తమ భూములనూ ఇళ్ళనూ అమ్మి జీసస్ శిష్యుని పాదాలకడ సమర్పించేవారు. అవసరాన్ని బట్టి ప్రతి వ్యక్తికీ పంపకం జరిగేది'.

ఆ తొలిరోజుల్లో సైలీషియా రాష్ట్రంలో, టార్యన్ నగరంలో 'జువెనల్' అనే ఒక సిరియన్ వర్తకుడు నివసిస్తూ వచ్చాడు. అతను బాగా శ్రీమంతుడు. వజ్రవైడూర్యాల వ్యాపారం. జువెనల్ చాలా పేదకుటుంబంలో పుట్టాడు. కాని తన తెలివి తేటలవల్లా, పరిశ్రమవల్లా సంపదనూ తన తోటి వారిలో గొప్ప గౌరవాన్నీ సంపాదించాడు. నగరంలో అతనికి గొప్ప ప్రతిష్ఠ ఉన్నది. చాలా విదేశాలు పర్యటించి అనుభవం గడించాడు. చదువుకున్నవాడు కాకపోయినా అనుభవంవల్ల ఎన్నో విషయాలు తెలుసుకున్నాడు. అతని శక్తి సామర్థ్యా

లను వివేకానికి అందరూ అతన్ని గౌరవించేవారు. అతను క్రైస్తవ మతంలో కలవలేదు. రోమన్ సామ్రాజ్య కాలంలో మర్యాదస్తులందరూ అనుసరిస్తూవచ్చిన రోమన్‌మతాన్నే అను సరిస్తూ వచ్చాడు.

సైలీషియానగరం రోమ్‌నగరానికిచాలాదూరం. రోమన్ గవర్నర్లు పరిపాలిస్తూవచ్చేవారు. రోమ్‌నగర నాగరికత సైలీషియాలో ప్రతిఫలించేది. గవర్నర్లు చక్రవర్తిని అనుసరించేవారు.

జువెనల్ తను చిన్నతనంలో విన్న కథలన్నీ జ్ఞప్తికి తెచ్చుకున్నాడు. నీరోచక్రవర్తి రోమ్‌నగరాన్ని తగలపెట్టాడు. నీరో తరువాత రాజ్యంచేసిన చక్రవర్తులందరూ ఒక్కొక్కరే పతనమై నశించడం జువెనల్ చూచాడు. తను వివేకం ఉన్న వాడుకాబట్టి రోమన్‌మతంలో అంత పవిత్రమైనవిషయం ఏమీ లేదనీ, అంతా మానవకల్పితమేననీ గమనించాడు. కాని, ఉన్న వ్యవస్థకు ఎదురీదడం శ్రేయస్కరం కాదనీ, తన మన శ్శాంతికోసం దానితో సరిపెట్టుకోవడమే మంచిదనీ గ్రహించాడు. నిజం ఆలోచిస్తే తన చుట్టూఉన్న జీవితం అర్థరహితంగా ఉంది. అతను అప్పుడప్పుడు వ్యాపారంమీద రోమ్ వెళ్ళేవాడు. అక్కడిజీవితం మరింత అనర్థకంగా కనిపిస్తోంది. అతన్ని ఎన్నోసమస్యలు ఎదుర్కొనేవి. ఎన్నో అనుమానాలు కలిగేవి. అంతటికీ కారణం ప్రజల్లో విద్య లేకపోవడం అనుకునే వాడు.

జువెనల్‌కు పెళ్ళయింది. నలుగురు పిల్లలు. ముగ్గురు చనిపోయారు. జూలియస్ ఒక్కడే మిగిలాడు.

ఒక్కగాను ఒక్కడు కావడంవల్ల జూలియస్‌ను ఎంతో గారాబంగా పెంచాడు. ముఖ్యంగా తన కొడుకును విద్యావంతుణ్ణి చేదామనుకున్నాడు. విద్యావంతు డవుతే తనను కలవరపరిచి, తన మనస్సులో కల్లోలం రేపిన జీవిత సమస్యలు అతన్ని కలవరపరచవు. జూలియస్‌కు పదిహేనేళ్ళు వెళ్ళగానే ఒక వేదాంతిదగ్గర చదువుకు కుదిర్చాడు. ఆ వేదాంతి ఊళ్ళో ఎందరో యువకులకు విద్యా గురువుగా ఉంటున్నాడు. జూలియస్‌కు తోడుగా పామ్‌ఫిలియస్ అనే మరో యువకుణ్ణికూడా చదువుకు పంపాడు. పామ్ ఫిలియస్ తండ్రి పూర్వం జువెనల్ వద్ద బానిసగా పనిచేశాడు. తరువాత అతన్ని విముక్తులచేశాడు. జువెనల్.

కుర్రాళ్ళిద్దరూ మంచి స్నేహితులు. ఇద్దరిదీ ఒకే వయస్సు. ఇద్దరూ చురుగ్గా అందంగా ఉండేవారు. ఎంతో శ్రమించి చదువుకునేవారు. చక్కని మర్యాద, జూలియస్ కవుల గ్రంథాలలో, గణితంలో, ప్రత్యేకత సంపాదించాడు. పామ్‌ఫ్లియస్ వేదాంతంలో సంపాదించాడు.

చదువు పూర్తి కావడానికి ఇంకాసంవత్సరం ఉన్నదనగా, విధవరాలైన తన తల్లి డాఫెన్ నగరానికి వెడుతున్నదనీ, ఆమెతో తనూ వెళ్ళాలనీ, అందుచేత చదువుకొనసాగించడానికి వీలుండదనీ పామ్‌ఫ్లియస్ తన గురువుతో చెప్పాడు.

గురువు ఎంతో చింతించాడు. జువెనల్‌కూడా చింతించాడు. కాని అందరికంటె, జూలియస్‌కు ఎక్కువచింత కలిగింది. కాని పామ్‌ఫ్లియస్ వెళ్ళక తప్పిందికాదు. గురువు దగ్గరా, స్నేహితుడి దగ్గరా సెలవు తీసుకున్నాడు.

రెండు సంవత్సరాలు గడిచాయి. జూలియస్ చదువు పూర్తి చేసుకున్నాడు. ఈ రెండు సంవత్సరాలలో ఒక్కసారి కూడా స్నేహితుణ్ణి కలుసుకోలేదు.

ఒకరోజు జూలియస్ వీధిలో వెళుతూ ఉండగా స్నేహితుడు తటస్థించాడు. తన ఇంటికి ఆహ్వానించి, 'ఏంచేస్తున్నావు? ఎక్కడున్నావు?' అని క్షేమ సమాచారాలు విచారించాడు. ఇంకా అదే నగరంలో తనూ తనతల్లీ ఉంటున్నామని చెప్పాడు. పామ్ఫిలియస్.

'మేము ఒంటరిగా ఉండడం లేదు. ఎందరో స్నేహితులతో కలిసి ఉంటున్నాం. అందరం కలిసి ఒకే కుటుంబంలా జీవిస్తున్నాం ప్రతిదీ మా అందరికీ చెంది ఉంటుంది' అన్నాడు.

'అదెలా?' అన్నాడు జూలియస్.

'ఏ వస్తువూ తన సొంతంగా ఎవరూ భావించరు. అందరం కలిసి అనుభవిస్తాం' అన్నాడు పామ్ఫిలియస్.

'ఎందువల్ల?'

'మేము క్రైస్తవులం.'

'ఇదెలా సాధ్యం? క్రైస్తవులు పిల్లల్ని చంపి తింటారని విన్నాను అయితే నీవూ అందులో పాల్గొంటూ వన్నమాట!' అన్నాడు జూలియస్ ఆశ్చర్యంతో.

ఈ రోజుల్లో అరాజకవాదిగా జీవించడం ఎంతకష్టమో ఆరోజుల్లో క్రైస్తవుడంటే అంతే. ఒక వ్యక్తి క్రైస్తవమతంలో చేరగానే అతన్ని జైల్లో పెట్టేవారు తన విశ్వాసం వదిలిపెట్టే వరకూ యాతనలు పెట్టేవారు. వదలని పక్షంలో ఉరి తీసేవారు.

'ఒకమాటు మా ఊరికి వచ్చిచూడు. మా జీవితంలో పెద్ద విచిత్రమేమీలేదు. మేమూ అందరిలాగానే జీవిస్తాం. చెడు చెయ్యకుండా మామూలుగా జీవించడానికి యత్నిస్తాం' అన్నాడు పామ్ఫ్లియస్.

'డబ్బు మీ స్వంత ఆస్తికింద భావించకపోతే ఎలా జీవించగలుగుతున్నారు?' అని అడిగాడు జూలియన్.

'అలాగే జీవిస్తాం. మన సోదరులకోసం మనం పనిచేస్తే వారు మనకోసం చేస్తారు.'

'మన శ్రమను వాళ్ళు వినియోగించుకుని మనకోసం పని చెయ్యకపోతే ఎలా?'

'అలాంటివాళ్ళు ఎవరూ లేరు. అలాంటివాళ్ళు భోగలాలసులుగా ఉంటారు. మాదగ్గరికి రానేరారు. మా జీవితం సర్వసాధారణంగా ఉంటుంది. కాని భోగభాగ్యాలతో తులతూగేది కాదు.'

'కాని, పనీపాటాలేకుండా పొట్టపోసుకుందామనుకునే సోమరి పోతులు చాలామంది ఉంటారు.'

'అలాంటివారు కొందరు ఉండొచ్చు. కాని వారిని మేమెంతో ప్రీతితో ఆహ్వానిస్తాం. ఇటీవల అలాంటివ్యక్తి ఒకడు మాదగ్గరికివచ్చాడు. మొదట్లో సోమరిగా ఉండేవాడు. కాని, రాను రాను తన అలవాట్లు మార్చుకుని, మంచివాడుగా మారాడు.'

'అతను అలా మారకపోతే ఏమయ్యేది?'

'అలాంటివాళ్ళుకూడా కొందరున్నారు. అలాంటివాళ్ళను మరింతగా ప్రేమించాలని మా పెద్ద సైరిల్ చెబుతాడు.'

'పనికిమాలినవాడిని ఎలా ప్రేమించగలం?'

'మనిషిని ప్రేమించక మరేం చెయ్యగలం?'

'కాని, ఎవరేది కోరితే అదల్లా ఎలా ఇవ్వగలం? మా నాన్న అలా ఇచ్చిఉంటే ఏమైఉండేవాడు?' అని అడిగాడు జూలియస్.

'నాకు ఆ విషయం అంతగా తెలీదు. మా అవసరాలకు తగినంత మాకెప్పుడూ ఉంటుంది. ఎప్పుడైనా మాకు తింటానికీ కట్టుకోడానికీ తరుగుబడితే మా సోదరుల్లో ఎవరినైనా అడుగుతాం. వారిస్తారు. కాని అలాటిది ఎప్పుడో కాని జరగదు. ఒక్కసారి మాత్రం నేను భోజనం లేకుండా పడుకోవలసి వచ్చింది. చాలా అలసి ఉండడంవల్ల, ఎవరినీ అడిగే ఓపికలేక అలా పడుకున్నాను.'

'నాకు మీరెలా జీవిస్తున్నారో అర్థం కావడంలేదు. డబ్బు దాచకుండా అందరికీ ఇచ్చేస్తే ఆకలితో చనిపోతావని చెప్పాడు నాన్న' అన్నాడు జూలియస్.

'మాకు అలాంటిది ఎన్నడూ సంభవించలేదు. కావలసి ఉంటే ఒకమాటు వచ్చి చూడు. మేము బాగా బ్రతకడమే కాక, కావలసినంత మిగలనుకూడా మిగుల్తోంది'

'ఎలా?'

'మా అందరికీ, ఒకే మతంలో ఒకే ధర్మంలో విశ్వాసం ఉంది. కాని, ఎవరి శక్త్యానుసారంగా వారు ఆ ధర్మాలు నిర్వర్తిస్తారు. సత్యజీవన పథంలో ఎక్కువదూరం పురోగమించిన వారు కొందరుంటారు. మొదటి మెట్టులోనే ఉన్నవారు కొందరుంటారు. ఎంతదూరంలో ఉన్నా మాకు అవధి కనిపిస్తూ

ఉంటుంది. మా అవధి జీసస్. పరిపూర్ణ జీవనస్వరూపుడైన ఆయన మాకు సాక్షాత్కరిస్తూ ఉంటాడు. మా జీవితాల ద్వారా ఆ గమ్యాన్ని చేరడానికి శాయశక్తులా యత్నిస్తాం, ఆ యత్నం లోనే మా శ్రేయస్సు ఇమిడి ఉంటుంది. మాలో కొందరు, మా పెద్ద సైరిల్, ఆయన భార్య పెలాగియూ లాగా పరిపక్వత పొందినవారు. వారు మానాయకులు. మాకంటెముందుంటారు. కొందరు వెనక ఉంటారు. మరికొందరు మరీ వెనగ్గాఉంటారు. కాని అందరం ఒకే బాటలో నడుస్తున్నాం. ముందున్న వాళ్ళు క్రైస్తవ ధర్మంలో పరిపూర్ణత పొందుతారు. వారికి ఆత్మత్యాగం పూర్తిగా సిద్ధిస్తుంది. జీవితాన్ని కాపాడడంకోసం జీవితంత్యజిస్తారు, సమర్పిస్తారు. వాళ్ళకు కోరికలేమీ ఉండవు. సర్వసంగ పరిత్యాగం చేస్తారు ప్రాణాలివ్వడానికికూడా వెనుదీయరు. మరి కొందరు వీరికంటె కొద్దిగా బలహీనులుంటారు. వారికి అల వాటుపడిన తిండి గుడ్డా లేకపోతే చింతిస్తారు. ఇంతకంటె మరీ బలహీనులు కొందరుంటారు. కొత్తగా బాటలో అడుగుపెట్టిన వారు. వీరు తమ పాత పద్ధతులు త్వరగా వదులుకోలేరు. వారి అవసరాలు తీర్చుకుని మిగిలింది మాత్రమే ఇస్తారు. అదీకాక మాలో చాలామంది క్రైస్తవేతరులతో సంబంధ బాంధవ్యా లున్నవారే. ఒకనికి క్రైస్తవేతరుడైన తండ్రి ఉంటాడు. తన ఆస్తి కొడుక్కు ఇస్తాడు. కొడుకు ఆ ఆస్తిని అందరికీ ఇచ్చే స్తాడు. మరొకనికి అలాటితల్లి ఉంటుంది. కొడుకుకు సహాయం చేస్తూంటుంది. మరొకరికి అలాటి భార్య ఉంటుంది. ఒక స్త్రీకి అలాటి భర్త ఉంటాడు. ఇలా మేము పరస్పరం సహాయం

చేసుకుంటూ ఉంటాము. ఇందువల్లనే మామతం అందరికీ సంతృప్తినిస్తుంది'

ఇదంతా విని జూలియస్, ఇదే నిజమవుతే మీరు జీసస్ బోధలను అనుసరించడం లేదన్నమాట. అనుసరిస్తున్నట్టు నటిస్తున్నారు. అంతే. ఉన్నదంతా ఇచ్చెయ్యకపోతే మీకూ నాకూ ఇక భేదం ఏమిటి? నా ఉద్దేశంలో క్రైస్తవుడు క్రీస్తు చెప్పిన ధర్మాన్ని పూర్తిగా నెరవేర్చాలి. అంతా యిచ్చేసి బికారి కావాలి' అన్నాడు.

'అలా చెయ్యగలిగితే మరీ మంచిదే. కాని నీ వలా ఎంచాత చెయ్యవు? అన్నాడు పామ్ఫిలియస్.

'మీ రలా చెయ్యడం చూచి, తరువాత నేను చేస్తాను.' అన్నాడు జూలియస్.

'ఇతరుల మెప్పుకోసం మేము ఏదీ చెయ్యం. అందరూ మెచ్చుకుంటారని నీవు నీకున్నదంతా త్యజించి మాలో కలిసి పోవాలని నేను కోరను. ప్రదర్శనకోసం మనం ఏ పనీ చెయ్య కూడదు. విశ్వాసంతోనే చెయ్యాలి' అన్నాడు పామ్ఫిలియస్.

'విశ్వాసం అంటే నీ ఉద్దేశం ఏమిటి?'

'విశ్వాసం అంటే మా ఉద్దేశ్యంలో ప్రపంచంలోని అన్ని పాపాలనుంచీ, మృత్యువునుంచీ విముక్తి. జీసస్ బోధను అనుసరించి జీవిస్తే విముక్తి లభిస్తుంది. ఇతరుల అభిప్రాయాలను మనం లెక్క చెయ్యకూడదు. మానవులను సంతృప్తి పరచడానికి మేము ఏపనీ చెయ్యం. ఇలాటి జీవన విధానంలోనే మా శ్రేయస్సు ఇమిడిఉన్నది. కాబట్టి ఈ విధానాన్ని అనుసరిస్తాం.'

'స్వార్థరహితంగా జీవించడం అసాధ్యం. ఇతరులకంటె ఎక్కువగా మనల్ని మనం ప్రేమించుకుంటాం. ఈ గుణం మనకు జన్మతః వచ్చింది. మీరూ అంతే. మీలో కొందరు తమపై తామే జాలిపడతారని చెప్పావు. అలాటివాళ్ళు వారి సుఖాలను వారు చూచుకుంటారు. తమ స్వసుఖాలు అన్వే షిస్తూ మీ మతాన్ని విస్మరించి కొన్నాళ్ళకు మాలో కలిసి పోతారు' అన్నాడు జూలియస్.

'అలా ఎన్నటికీ జరగదు మా సంఘం నానాటికీ బల పడుతుంది. రోజురోజుకూ మా సోదరుల సంఖ్య పెరుగు తోంది. కొత్తకొట్టలు చేర్చడంవల్ల మంట పెరిగినట్టు మా సంఘబలం పెరుగుతుంది. ఇదీ మా మతం.'

'మీ మతం ఏమిటో నాకు అర్థం కావడంలేదు.'

'జీసస్ చెప్పినప్రకారం మేము జీవితాన్ని అర్థం చేసు కుంటాం. ఇదే మా మతం.'

'అంటే?'

'ఒకసారి జీసస్ ఒక చిన్న కథ చెప్పాడు. కొందరు ఒక ద్రాక్షతోట పెంచుతున్నారు. తోట యజమానికి వాళ్ళు కవులు చెల్లించాలి. ఈ ప్రపంచం ద్రాక్షతోట. మన్నం ఈ తోటను కవులుకు తీసుకున్నాం. ఈ తోటకు యజమాని భగవంతుడు. యజమాని ఇచ్ఛానుసారంగా జీవించి మనం శిస్తు చెల్లించాలి. కాని మనుష్యులు తమ ప్రాపంచికసుఖాల కోసం జీవిస్తారు. ద్రాక్షతోట తమ సొంతం అనుకుంటారు. తమకు శిస్తు చెల్లించాల్సిన బాధ్యత లేదనుకుంటారు. ఫలసాయం మాత్రం తమదనుకుంటారు. శిస్తు వసూలుకోసం యజమాని

ఒకతన్ని పంపించాడు. వాళ్ళు అతన్ని వెళ్ళగొట్టారు. తరువాత యజమాని తన కొడుకునే పంపించాడు. అతన్ని చంపారు. సాధారణంగా ప్రపంచలో మనుష్యులందరూ ఇంతే. ఈశ్వరసేవకోసం, ఈ జీవితం ప్రసాదింపబడిందని అర్థం చేసు కోరు. కాని, ఈ ప్రాపంచిక విశ్వాసం అసత్యమని జీసస్ బోధించాడు. మనం శిస్తు చెల్లించకపోతే ద్రాక్షతోట నుంచి మనమే వెళ్ళిపోవాల్సిఉంటుం దన్నాడు. మనం సుఖాలుగా పరిగణించేవన్నీ – తిండికాని, తాగుడుకాని, వినోదవిలాసాలు కాని, – ఈ సుఖాలకోసమే మనం జీవితాన్ని అంకితంచేస్తే అవి సుఖాలు కావన్నాడు. ఈశ్వరేచ్ఛను అనసరించి జీవించినప్పుడే అవి సుఖాలవుతాయన్నాడు. అప్పుడే అవి సహజమైన సుఖా లవుతాయి. బాధ్యతనుంచి సుఖాలను వేరుపరచడం వ్రేళ్ళు లేని మొక్కను నాటడం లాంటిది. జీవితంలోని మంచి కేవలం సుఖాల్లో లేదు. ఈశ్వరేచ్ఛను అనుసరించడంలో ఉంది. ఇలా జీవిస్తే నూతనానందాన్ని మనం చూడగలుగుతాం. జీసస్ ఇలా చెప్పాడు. 'శ్రమించేవారందరూ నన్ను చేరండి. బరు వులూ బాధలూ ఉన్నవారందరూ నాదగ్గరకు రండి. నేను మీకు శాంతినీ విశ్రాంతినీ ఇస్తాను.

నా కాడిని మీరు మోయండి. నన్ను తెలుసుకోండి. నా హృదయం ఎంతో వినమ్రమైనదీ, అధోనతమైనదీ. అప్పుడు మీ అంతరాత్మలకు శాంతి దొరుకుతుంది. నేను మీ మీద ఉంచే బరువు చాలా తేలికైనది.'

పామ్ఫిల్లియస్ ఇలా మాట్లాడాడు. జూలియస్. ప్రశాంతంగా విన్నాడు. అతని హృదయం ద్రవించింది. కాని

పామ్ఫ్లియస్ మాటలు అతనికి స్పష్టంగా బోధపడలేదు. మొదట్లో అతను మోసం చేస్తున్నాడేమో అనిపించింది. పాంఫ్లియస్ కండ్లలోకి చూచాడు. అతని కళ్ళలో మంచితనం నిండారి తొణికిసలాడుతోంది. అతన్ని అతనే మోసం చేసుకుంటున్నాడనుకున్నాడు.

పాంఫ్లియస్, జూలియస్‌ను ఆహ్వానించాడు. జూలియస్ వస్తానని వాగ్దానంచేశాడు. కాని, తన పనుల్లో తాను మునిగి పోయి వెళ్ళలేకపోయాడు. తరువాత ఆ విషయమే మరిచి పోయాడు.

## 2

జూలియస్ తండ్రి పెద్ద శ్రీమంతుడు. ఏకపుత్రుడు కావడంచేత తన కొడుకంటే ఎంతో గర్వం. ఎప్పుడడిగినా కావలసినంత డబ్బిచ్చేవాడు. బాగా డబ్బున్న యువకులందరిలాగానే జూలియస్ హాయిగా, కులాసాగా, వినోద విలాసాలతో భోగ భాగ్యాలతో తన జీవితం గడిపేవాడు. తాగుడూ, జూదం, స్త్రీలూ, అన్నీ ఉండేవి.

ఈ సుఖాలకోసం డబ్బు విపరీతంగా ఖర్చయ్యేది. తన డబ్బు సరిపోయేది కాదు. ఒకమాటు తండ్రిని ఎక్కువ డబ్బడిగాడు. తండ్రి ఇచ్చాడు కాని, కొద్దిగా విసుక్కున్నాడు. తప్పు తనదైనా జూలియస్‌కు కోపం వచ్చింది. తండ్రిమీద మండి

పడ్డాడు. తమ తప్పు ఒప్పుకోడం ఇష్టంలేనివాళ్ళు ఇలాగే చేస్తారు.

తండ్రి దగ్గర తీసుకున్న డబ్బు అతిత్వరలో ఖర్చు చేశాడు. తనూ, ఒక తాగుబోతు స్నేహితుడూ ఒక తగాదాలో ఇరుక్కుని ఒకణ్ణి చంపేశారు. మాజిస్ట్రేటుకు ఈవిషయం తెలిసి అతన్ని అరెస్ట్ చేస్తానన్నాడు. తన తండ్రి జోక్యం కలిగించుకుని క్షమాపణ వేడుకుని కేసు తప్పించాడు. జూలియస్ సుఖలాలసత హెచ్చింది. అతనికి మరింత డబ్బు అవసరమైంది. మళ్ళీ ఇస్తానని ఒక స్నేహితుడి దగ్గర అప్పు తీసుకున్నాడు. పైగా అతని ఉంపుడు కత్తె ఒక బహుమతి కోరింది.

ఒక ముత్యాలహారం కొనిపెట్టమన్నది. అలా కొని పెట్టకపోతే తనను వదిలిపెట్టి మరొక శ్రీమంతుడి అండ చేరుతుందని జూలియస్‌కు తెలుసు.

జూలియస్ తన తల్లిదగ్గరికి వెళ్లి డబ్బడిగాడు. డబ్బివ్వకపోతే ఆత్మహత్య చేసుకుంటానని బెదిరించాడు. తన దుస్థితికంతా తన తండ్రే కారణమన్నాడు.

'మొదట్లో నాతండ్రి నన్ను ఇలాంటి జీవితానికి అలవాటు చేశాడు. తరువాత డబ్బుకోసం నసుకుతున్నాడు. లేకపోతే ఇలాంటి గొడవలూ, కష్టాలూ వచ్చిఉండేవి కావు. ఇప్పుడు నేను నానాకష్టాలు పడి వడ్డీవ్యాపారస్తులదగ్గర డబ్బు తీసుకురావలసివస్తోంది. వాళ్లు నన్ను పీల్చి పిప్పిచేస్తున్నారు. నా బాధలు నా తండ్రి అర్థంచేసుకోడు. తనుకూడా ఒకప్పుడు యువకుడేనన్న విషయం మరిచిపోయాడు. నన్ను ఇలాంటి

దుసితికి తీసుకొచ్చాడు. నేను ఆత్మహత్యచేసుకుంటాను' అని గొడవచేశాడు.

జూలియస్‌ను చిన్నతనంనుంచి తల్లికూడా పాడుచేసింది. జూలియస్ ఇలా బెదిరించగానే అతని తండ్రిదగ్గరికి వెళ్ళి డబ్బడిగింది. తండ్రి తల్లినీ కొడుకునూ ఇద్దరినీ కలిపి కేకలేశాడు. జూలియస్ తండ్రితో కటువుగా మాట్లాడాడు. జువెనెల్‌కు కోపంవచ్చి జూలియస్‌ను కొట్టాడు. జూలియస్ మళ్ళీ కొట్టడానికి తండ్రిచెయ్యి పట్టుకున్నాడు. తండ్రి బానిసలను కేకేశి కొడుకును బంధించి గదిలో పెట్టమని ఆజ్ఞాపించాడు.

జూలియస్, ఒంటరిగా గదిలో కూచుని తననూ తన తండ్రినీ, తన జీవితాన్నీ తిట్టిపోసుకున్నాడు. జూలియస్‌కంటె అతని తల్లి ఎక్కువ బాధపడింది.

అసలు తప్పు ఎవరిదో గ్రహించడానికి ఆమె ప్రయత్నించలేదు. తన ఏకపుత్రుడిపై ఆమెకు ఎక్కడ లేనీ జాలి. భర్త దగ్గరకు వెళ్ళి కొడుకును క్షమించమని వేడుకుంది. కాని వినలేదు. కొడుకును చెడగొట్టినందుకు కోప్పడ్డాడు. ఆమె తిరిగి భర్తను సూటిపోటి మాట లన్నది. చివరకు జువెనల్ భార్యను కొట్టాడు. ఆమె దీనికికూడా లెక్క చెయ్యలేదు.

కొడుకుదగ్గరకు వెళ్ళి తండ్రిని క్షమాపణ వేడుకోమని బలవంత పెట్టింది. అతను కోరినడబ్బు తను దొంగతనంగానైనా తీసుకుని ఇస్తానన్నది. తల్లి మాటకు జూలియస్ ఒప్పుకున్నాడు. తరువాత తల్లి జువెనల్‌వద్దకు వెళ్ళి కొడుకును క్షమించమని కోరింది. తల్లినీ కొడుకునూ చాలాసేపు నిందించి కడకు క్షమించడానికి ఒప్పుకున్నాడు జువెనల్. ఒక షరతుకూడా

పెట్టాడు. ఒక శ్రీమంతుడైన వర్తకుని కుమార్తెను వివాహం చేసుకుంటే ఒప్పుకుంటానన్నాడు. ఈ సంబంధంకోసం జువెనల్ చాలా రోజులనుంచి ప్రయత్నిస్తున్నాడు.

'నా డబ్బూ అతనికి దక్కుతుంది, పైగా భార్యద్వారా కట్నం కూడా వస్తుంది. తరువాత అతన్ని మర్యాదస్తుడిలా బ్రతకమను. నామాట వింటే తప్పకుండా క్షమిస్తాను. నా మాటకు ఎదురు తిరిగితే మాజిస్ట్రేటుకు ఒప్పచెబుతాను' అన్నాడు జువెనల్.

జూలియస్ తన తండ్రి షరతులకు ఒప్పుకున్నాడు. వెంటనే అతన్ని విడుదలచేశారు. పెండ్లి చేసుకుంటాననీ మర్యాదగా బ్రతుకుతాననీ వాగ్దానంచేశాడు. కాని నిజానికి అతనికి అలాటి ఇచ్ఛేమీ లేదు.

ఇప్పుడు అతను ఇంట్లోనే ఉంటున్నాడు. బైటికి కదలడంలేదు. కాలు కదపకుండా కూచోడమంటే అతనికి దుర్భరంగాఉంది. తండ్రి తనతో మాట్లాడడంలేదు. అందువల్ల తల్లితో పోట్లాడాడు. ఆమె ఏడుస్తూ కూచుంది.

ఒకరోజున తన తల్లి అతన్ని గదిలోకి పిలిచి ఒక విలువ గల రాయి నిచ్చింది. తన భర్త గదిలోనుంచి ఈ రాయి తీసుకుంది.

'ఈ రాయి తీసుకునివెళ్ళి అమ్ము. ఈ ఊళ్ళో కాదు— మరో ఊళ్ళో. ప్రస్తుతానికి ఈ విషయం దాచగలుగుతాను. ఒకవేళ బైట పడితే నింద, బానిసలపై వేశేస్తాను' అన్నది తల్లి.

తల్లి మాటలు జూలియస్ హృదయంలో బాకుల్లా దూసుకునిపోయాయి. తన తల్లి చర్య అతనికి భయంకరంగా తోచింది. ఆ రాయి తీసుకోకుండానే అతను ఇల్లు విడిచిపెట్టి వెళ్ళాడు.

అతను ఎక్కడికి వెడుతున్నాడో అతనికి తెలీదు. ఏ ఉద్దేశంతో వెడుతున్నాడో కూడా అతనికి తెలీదు. అలాగే నడుస్తూ వెళ్ళాడు. అతనికి ఎక్కడికైనా దూరంగా వెళ్ళిఒంటిగా ఉందామనిపించింది. ఇలా వెళ్ళి వెళ్ళి 'దయూనా' దేవత ఉండే పవిత్రా రామం చేరాడు. ఒక ఏకాంత ప్రదేశంలో కూచుని ఆలోచించడం మొదలెట్టాడు. దేవతను ప్రార్థిస్తే శాంతి వస్తుందేమో అనుకున్నాడు. కాని అతనికి దేవతల్లో నమ్మకం పోయింది. దేవతలు సహాయం చెయ్యరనుకున్నాడు. మరి ఎవరు చేస్తారు? ఈ ప్రశ్న అతని మనస్సులో మార్మోగింది.

తన తరిస్థితి తనకే అర్థం కాకుండా ఉంది. ఎటు చూచినా అంధకారం, అశాంతి – అంతరంగం నిండా అంధకారం ఆవరించింది. ఆవేదన చెలరేగుతోంది. అతనికి గత్యంతరం తోచలేదు. తన అంతర్వాణి తప్ప మరోదీప్తి అతనికి కనుపించలేదు. తన జీవితాన్నీ తన పనులనూ ఆ దీప్తితోనే పరిశీలించాలి. అలా పరిశీలించాడు. తన జీవితం అర్థరహితంగా కనుపించింది. తను ఇన్నాళ్ళూ ఎందుకు బాధపడ్డట్టు? ఈ బాధకంతా ఫలితం ఏమిటి? తన పసిజీవితాన్ని ఇలా ఎందుకు వ్యర్థం చేసుకున్నాడు. తన పనులు తనకు దుఃఖం అధికంగానూ సుఖం అల్పంగానూ కలిగించాయి. అదీగాక తను ఒంటరి తనాన్ని అనుభవిస్తున్నాడు. తనకు అయినవాళ్ళెవరూ లేరు. ఇదివరకు తను ప్రేమించే తల్లి ఉండేది. తండ్రి ఉండేవాడు. స్నేహితు

బుండేవారు. ఇప్పుడెవరూ లేరు. ఇప్పుడతన్ని ఎవరూ ప్రేమిం చడంలేదు. అందరికీ తనుబరువుగా ఉన్నాడు. అందరికీ తనవల్ల బాధగా ఉన్నది. తనవల్ల తన తల్లి తండ్రితో పోట్లాడింది. తన తండ్రిజీవితమంతా కష్టపడి కూడపెట్టిన డబ్బు తను పాడుచేశాడు. తన స్నేహితులకు తను ప్రమాదకరమైన ప్రతిస్పర్ధిగాఉన్నాడు. అందరూ తన మృత్యువునే కోరాలి.

ఇలా తన జీవితాన్నంతా తిరగేసుకున్నాడు జూలియస్. మళ్ళీ అతనికి పామ్ఫ్లియస్ జ్ఞాపకం వచ్చాడు. తన మిత్రుడి ఆహ్వానంకూడా జ్ఞాపకం వచ్చింది. మళ్ళీ తిరిగి ఇంటికి వెళ్ళకుండా అక్కడికే వెడదామనుకున్నాడు

తన దుస్థితి తనకే ఆశ్చర్యం కలిగించింది. మళ్ళీ తన జీవితం తనకు జ్ఞాపకం వచ్చింది. భయం కలిగింది. తనను ఎవరూ ప్రేమించడంలేదు. తనూ ఎవరినీ ప్రేమించడంలేదు. తన తల్లీ, తండ్రీ స్నేహితులూ అందరూ తనను నిరాకరిస్తున్నారు. తన చావు కోరుతున్నారు. తనుమాత్రం ఎవరినైనా ప్రేమిస్తున్నాడా ? లేదు. తన స్నేహితులు ? జూలియస్ ఒక్కమాటు తనస్నేహితులందరినీ తిరగేసుకున్నాడు. తను ఒక్కరినీ ప్రేమించడంలేదు. అందరూ తనకు వ్యతిరేకులు. ఇలాంటి స్థితిలో తనను ఒక్కడూ జాలి దలచడు. తన తండ్రి ? ఈ ప్రశ్న జూలియస్కు మరింత భీకరంగా కనుపించింది. తన హృదయాన్ని శోధించుకున్నాడు. తన తండ్రిపై ప్రేమ లేకపోగా ద్వేషంకూడా ఉంది. పైగా తన తండ్రి చావు కోరుతున్నాడు తను సుఖించాలంటే తన తండ్రి చనిపోవాలి.

తన తల్లి జ్ఞాపకం వచ్చింది. అతనికి జాలి కలిగింది. నా తల్లి కోసం చింతిస్తున్నాను కాని ఆమె పైకూడా నాకు ప్రేమ లేదు, ఆమె ఎలాఅయినా నా కొరకే. నాకు కావలసిందల్లా ఆమె సహాయం. నే నొక జంతువును. అందులో భయంకరంగా వేటాడబడిన జంతువును. నాకూ జంతువుకూ ఒకటే భేదం. నేను తలుచుకుంటే ఆత్మహత్య చేసుకోగలను. కాని జంతువుకు అది సాధ్యం కాదు. నేను నా తండ్రిని ద్వేషిస్తున్నాను. తల్లిని, స్నేహితులను అందరినీ ద్వేషిస్తున్నాను కాని, పామ్ఫ్లియస్‌ను మాత్రం ద్వేషించడం లేదేమో? అనుకున్నాడు జూలియస్.

మళ్ళీ అతనికి పామ్ఫ్లియస్ జ్ఞాపకం వచ్చాడు. వా రిద్దరూ కడసారి కలుసుకోడం, పామ్ఫ్లియస్‌మాటలూ జ్ఞాపకం వచ్చాయి. బరువులూ బాధలూ ఉన్నవారందరూ నావద్దకు రండి. నేను విశ్రాంతి నిస్తాను అని జీసస్ చెప్పిన మాటలు తనకు చెప్పాడు పామ్ఫ్లియస్.

జూలియస్ ఇలా ఆలోచిస్తూ కూచున్నాడు. అతని కళ్ళముందు పామ్ఫ్లియస్ వదనం కనుపించింది. ఆ ముఖంలో సాధుత్వం, నిర్భీతి, ఆనందం ఉట్టిపడుతున్నాయి.

జూలియస్ ఇలా విచారించడం మొదలెట్టాడు. 'అసలు నే నెవరు? నాస్వరూపం ఎలాంటిది? నేనొక మానవుణ్ణి. ఆనందాన్ని అన్వేషిస్తున్నాను. ఐహికసుఖాల్లో ఆనందం లభ్య మవుతుందనుకున్నాను. కాని లభ్యంకాలేదు. నాలాగా జీవించే వారెవరికీ ఆనందం దొరకదు. అలాటివారు కడకు దుఃఖాల పాలవుతారు. కాని ఎప్పుడూ ఆనందమయంగాఉండే వ్యక్తి ఒకడు ఉన్నాడు. అతను దేన్నీ వాంఛించడు. అతినిలాటి

వాళ్ళు ఎందరో ఉన్నారట. జీసస్ బోధలు అనుసరిస్తే ఆనందం దొరుకుతుందన్నాడు. ఇందులో నిజం ఎందుకుండకూడదు ? నిజం ఉన్నా లేకపోయినా అతని పలుకులు నన్ను ఆకర్షించాయి. నేను అక్కడికి వెడతాను.'

జూలియస్ ఇలా తనకు తాను ఉపదేశం చేసుకుని ఆరామాన్ని విడిచిపెట్టి క్రైస్తవులు నివసించే గ్రామంవైపుకు వెడదామని నిశ్చయించుకున్నాడు.

# 3

జూలియస్ కదను తొక్కుతూ ఆనందంతో నడుస్తున్నాడు. అతను నడిచేకొద్దీ అతని శక్తి ఉత్సాహం మరింత హెచ్చాయి. పామ్ఫిలియస్ మాటలు జ్ఞాపకం చేసుకుంటూ నడుస్తున్నాడు. క్రైస్తవ జీవితం తన కళ్ళముందు కట్టినట్టుగా ఉంది. అది సంధ్యాసమయం. ప్రొద్దుకుంకుతోంది. తను కాసేపు విశ్రాంతి తీసుకుందామనుకున్నాడు. ఇంతలో రోడ్డు ప్రక్క అతనికి ఒక వ్యక్తి కనుపించాడు. మనిషి మధ్యవయస్కుడు. ముఖములో తెలివితేటలు కనుపిస్తున్నాయి. రోడ్డు ప్రక్కన కూచుని రొట్టె తింటున్నాడు. జూలియస్‌ను చూడగానే చిరునవ్వుతో, 'రావయ్యా యువకుడా! నీవింకా చాలా దూరం ప్రయాణం చెయ్యాలి. కాసేపు విశ్రాంతి తీసుకో' అన్నాడు. జూలియస్ అతనికి అభివాదం తెలిపి అక్కడ కూచున్నాడు. 'ఎక్కడికి వెడుతున్నావ్ ? అని అడిగాడు పరదేశి. 'క్రైస్తవుల దగ్గరికి' అన్నాడు జూలియస్.

'అసలు నీ కథేమిటి ?'

కథంతా చెప్పాడు జూలియస్.

ఆ అపరిచిత వ్యక్తి ఎంతో శ్రద్ధగావిన్నాడు. మధ్యలో మరికొన్ని ప్రశ్న లడిగాడు. కాని తన అభిప్రాయమేమీ చెప్ప లేదు. జూలియస్ చెప్పిన కథంతా విన్న తరువాత తన మూట సర్దుకుని వెళ్ళబోతూ జూలియస్‌తో ఇలా చెప్పాడు.

'యువకుడా ! నిన్ను చూస్తే వట్టి పిచ్చివాడిలా కను పిస్తున్నావు. నీ ఉద్దేశాన్ని వదిలిపెట్టు. నీకు తెలీకుండానే నీవు ఒక పెద్ద సుడిగుండంలో చిక్కుకున్నావు. నీ మంచికోసమే చెబుతున్నాను; నేను జీవితం లోతు పాతులు బాగా చూచిన వాణ్ణి, నీవు చిన్నవాడివి. నీకు అనుభవం తక్కువ. నాకు క్రైస్తవుల విషయం బాగా తెలుసు. నీకు తెలీదు. నీ జీవితం, నీ ఆందోళన నాకు బాగా అర్థమైంది. నా ఉద్దేశం చెబుతాను విను. తరువాత నీ ఇష్టంవచ్చిన నిశ్చయానికి రావచ్చు. నీవు వయస్సుకు చిన్నవాడివి. బాగా ఉన్నవాడివి. చూపులకు చాలా అందంగా కనుపిస్తున్నావు. నీ నరాల్లో ఇంకా వేడి రక్తం ప్రవహిస్తోంది. ఉద్రేకం ఉత్సాహం నీలో బాగా నిండిన్నాయ్. ఈ ఉద్రేకాలు, వాంఛలు నిన్ను కలవరపరచని శాంతిని కోరు తున్నావు. అలాంటి శాంతి క్రైస్తవులవల్ల దొరుకుతుందను కున్నావు.

అసలు శాంతి అనేది బైట ఎక్కడా దొరకదు. నీలో ఆందోళన ఆవేదన ఉన్నంతకాలం నీవు ఎక్కడికి వెళ్ళినా శాంతి దొరకదు. సెలిషియాలో, రోమ్‌లో ఉండడంవల్ల నీకు బాధ లున్నాయని అనుకుంటున్నావు. కాని నీబాధలు నీలోనే

ఉన్నాయి. నీవు ఇంతదూరం నడిచి అక్కడికి వెళ్ళినా ఈ ఆందోళనలే నిన్ను కలవరపరుస్తాయి, ఇంతకంటె ఎక్కువగా కూడా నీలో రేకెత్తుతాయి. ఈ క్రైస్తవులున్నారు - చూచావూ - నిజం చెప్పాలంటే ఒక ఆత్మవంచనలో నివసిస్తున్నారు. దీనికి కారణం వీరికి మానవస్వభావం తెలియక పోవడమే. కోరికలన్నీ తీరిపోయిన పండు ముదుసలి మాత్రమే వీరి బోధలు అనుసరించగలడు. కాని నీలాంటి యువకుడు - జీవితంలో కష్టనష్టాలు ఆట్టే చూడనివాడు - ఈబోధన ప్రకారం నడుచుకోలేడు. దీనికి కారణం ఈబోధలన్నీ మానవ స్వభావాన్ని పరిశీలించి దానికి అనుగుణంగా చెప్పినవికావు. ఊసుపోక నిర్మించిన గాలి మేడలలాంటివి. నీవు వాళ్ళ దగ్గరకు వెడితే ఈబాధలే మరింత తీవ్రరూపంలో నిన్ను కలచేస్తాయి. ఒక్కమాటు నీ జీవితాన్ని తిరగేసుకో. నీవాంఛలు నిన్ను తప్పుదోవల్లోకి ఈడ్చాయి. ఒకమాటు తప్పుదోవలో వెళ్ళావు. కాబట్టి ఇక ముందు నిన్ను నీవు సవరించుకోవచ్చు. ఏది ఎలాఉన్నా నీవు జీవితంలోని సుఖాల స్వారస్యాన్ని చవిచూచావు. కాని క్రైస్తవుల్లో చేరి బలవంతంగా కోరికలు అణుచుకుంటే మరింత హాని జరుగుతుంది. పైగా తీరనికోరికలు నిన్ను ఏడిపిస్తాయి. ఆనకట్ట లాకులెత్తి నీళ్ళు ప్రవహింపచేస్తే నీరు భూమినంతా తడుపుతుంది. పంటలు పండుతాయి. భూమి సస్యశ్యామలమవుతుంది. కాని నీళ్ళను బంధిస్తే బురదమట్టితో కలిసి పొర్లి ప్రవహిస్తుంది. మన కోరికలూ ఇలాంటివే. క్రైస్తవులు ముఖ్యంగా చెప్పే విషయం ఇది. వాళ్ళు హింస అంగీకరించరు. యుద్ధాలు, కోర్టులు, ఆస్తి, శాస్త్రం, కళ, విజ్ఞానం, దేన్నీ

అంగీకరించరు. జీవితాన్ని సుఖమయంచేసే విషయమేదీ ఒప్పు కోరు.

మనుష్యు లందరూ తమ గురువులాటి వారైనప్పుడు ఇది బాగానే ఉంటుంది. కాని మనుష్యులందరూ అలా తయారు కావడం సాధ్యపడే విషయమా? సాధారణంగా మనుష్యులకు కోరికలు ఉంటులు. కోరికలకు లొంగని మని షంటూ ఉండడు.

కోరికలు తుఫానులాంటివి. అందుకనే మనుష్యులు ఇలాంటి పరిస్థితిలో ఉన్నారు. ఆదిమవాసులూ, బర్బర జాతుల వారూ ఉన్నారనుకో. ప్రపంచంలో మనుష్యులందరూ క్రైస్త వుల్లాగా లొంగిపోతే అలాటి వారిలో ఒక్కడు చాలు — తన కోరికలు తీరడంకోసం ప్రపంచమంతా నాశనం చేశేస్తాడు. మనలో కోపం, ప్రతీకారం, — ఇలాటి భావాలు దేవతలు ఎందుకు పెట్టారంటావు? ఇవి మన జీవితానికి చాలా అవసరం. ఈ భావాలు, మంచివి కావని క్రైస్తవులు బోధిస్తారు. ఇవి మనలో నశిస్తే మానవజాతి బాగుపడుతుందంటారు. యుద్ధాలు హత్యలు, ఉరిశిక్షలు ఉండవంటారు. ఇది నిజమే కావచ్చు. కాని, మనుష్యులు ఆహారం పుచ్చుకోకపోతే హాయిగా ఉంటుం దనుకోడం ఎలాంటిదో అలాంటిది ఇది. ఇది వట్టి భ్రాంతి మాత్రమే. ఎన్నటికీ సంభవంకాదు. దీనివల్ల మానవ స్వభావం మారేదీలేదు. పదిపదిహేనుమంది ఒకవేళ తిండి మానేసి ఆక లితో చనిపోయినప్పటికీ - దానివల్ల మానవ స్వభావంకాని మానవజాతికాని మారదు.

ఇలాగే ఇతర కోరికలుకూడా. మానవుల్లో అనేక రకాలైన ఉద్రేకాలుంటాయి - కోపం, తాపం, ప్రతీకారేచ్ఛ, ప్రేమ, సుఖలాలసత, ఇలాంటివి. ఇవన్నీ మానవ సహజాలే. ఆహారం లేకపోతే మానవుడు ఎలా నశించిపోతాడో ఇవి లేక పోయినా మానవుడు అలాగే నశించిపోతాడు. వ్యక్తిగత సంపత్తిని క్రైస్తవులు ఒప్పుకోరు. ఇదికూడా పొరపాటు. ఒక్కమాటు ఆలోచించి చూడు. మనం ఎన్నో తోటలూ, దొడ్లూ, ఇళ్ళూ, వాకిళ్ళూ, పశువులూ చూస్తున్నాం. ఇవన్నీ మానవుడు వ్యక్తిగత వాంఛతో పెంచుకున్నవే. ఆస్తి హక్కులను రద్దుచేస్తే అన్నీ నశించి పోతాయి.

పాలం దున్నే మనిషి మచ్చుకైనా కనిపించడు. క్రైస్తవులు తమకు ఆస్తి లేదంటూ ఉంటారు. దాని ఫలితాన్ని అనుభవిస్తూనే ఉంటారు. సొత్తు అందరికీ చెందేటట్టుగా చేశామంటారు. కాని ఈ సొత్తు ఎక్కడనుంచి వచ్చింది? ఉన్నవారి దగ్గరినుంచేకదా? తమను తాము మోసం చేసుకుని ఇతరులను మోసం చేస్తారు. తమ ఉనికికోసం తామే శ్రమిస్తామంటారు. కాని ఇది అబద్ధం. వారి శ్రమ ఫలితం వారికి సరిపోదు. ఒకవేళ సరిపోయినా కూటికీ గుడ్డకూ చాలుతుంది. అంతే. కళలకూ విజ్ఞానానికి తావుండదు.

పైగా కళలూ విజ్ఞానం అనవసరమంటారు. కళలకూ విజ్ఞానానికి ప్రయోజనం లేదంటారు. అందుచేత వీళ్ళ సిద్ధాంతాలన్నీ మానవజాతిని మళ్ళీ ఆదిమ దశలోకి తీసుకునివెడతాయి.

మన కళలూ మన విజ్ఞానం గొప్పవి. వీటిద్వారా మానవసేవ చెయ్యలేక వీటిని నిరసిస్తారు. గుళ్ళు, గోపురాలు,

పూజనీయ విగ్రహాలు, ప్రదర్శనశాలలు—ఇలాటివేవీ వీరి దృష్టిలో పనికిరావు. ఇవన్నీ అనవసరమంటారు. గొప్ప విషయాలను తృణీకరించి తమ పతనావస్థను తాము కప్పి పుచ్చుకుంటారు. దేవుణ్ణి, దేవతలనూ ఒప్పుకోరు. తమ బోధకుని తండ్రిలోనే నమ్ముతారు. బోధకుణ్ణికూడా 'తండ్రీ' అని పిలుస్తారు. జీవితంలోని రహస్యాలన్నీ ఒక్క తమ బోధకునికిమాత్రమే తెలుసట! ఇంతకంటె పిచ్చి ఏమైనా ఉందా? మన మతం చూడు...ఎంత గొప్పదో. మన మతంలో ఇలా చెప్పబడి ఉంది: 'ప్రపంచం దేవతలమీద ఆధారభూతమైఉంది. మనుష్యులను దేవతలు రక్షిస్తున్నారు. తమ జీవితం బాగుకోసం దేవతలను గౌరవించి పూజించాలి, ఎవరికి వారు జీవిత సత్యాన్ని అన్వేషించి ఆలోచించాలి. ఈ విధంగా, ఒకవైపు దేవశక్తీ, మరోవైపు మానవజాతి సమిష్టి విజ్ఞానసంపత్తీ, మానవజాతిని నడిపిస్తున్నాయి. ఇలా మనం సత్యంవైపుకు ప్రయాణం చేస్తాం.

కాని ఈక్రైస్తవులకు దేవతలు వేరు. వాళ్ళు స్వయంగా ఆలోచించి తెలుసుకున్న విషయాలేమీలేవు. విజ్ఞాన సంపత్తీ లేదు. ఒక్క బోధకునిలో గ్రుడ్డిగా నమ్ముతారు. అతను చెప్పినదల్లా వేదవాక్యం అంటారు. ఇప్పుడు నీవే ఆలోచించుకో - దేవతల శక్తి, సమిష్టిమానవ విజ్ఞానం - ఇవి నీకు సరియైన దోవ చూపుతాయో, లేక ఒక్క వ్యక్తిలో గ్రుడ్డినమ్మకం చూపుతుందో.'

పరదేశి పలుకులు జూలియస్‌ను ఆశ్చర్యచకితుణ్ణి చేశాయి. అతని చివరిమాటలు జూలియస్ హృదయానికి

మరింత గాఢంగా హత్తుకున్నాయి. అతని నిశ్చయం సడలిపోయింది. ఎలా అలాటి అర్థరహితమైన నిశ్చయానికి రాగలిగానా అని తనే ఆశ్చర్యపోయాడు. కాని ప్రస్తుతం ఏమి చెయ్యాలో అతనికి పాలుపోలేదు. తన స్థితిగతులన్నీ పరదేశికి వివరించి చెప్పి అతని సలహాకోరాడు.

'అదే నేనూ చెప్పాలనుకుంటున్నాను,' అంటూ ప్రారంభించాడు పరదేశి.

'నీవు ఏం చెయ్యాలనికదూ నీవు అడుగుతున్నది? నాకు తోచినంతవరకూ నీవు అనుసరించవలసిన త్రోవ నాకు స్పష్టంగానే కనుపిస్తోంది. నీ దుఃఖా లన్నిటికి మూల కారణం నీ ఉద్రిక్త వాంఛలు. ఇవి మానవ సహజాలుకూడా. వాంఛలవలలో పడి నీవు ఇంతకాలం బాధపడ్డావు. జీవితం ఇలాటి పాఠాలే నేర్పుతుంది.

ఇలాటి అనుభవాలనుంచి మనం కొన్ని గుణపాఠాలు నేర్చుకోవాలి. నీవు జీవితాన్ని బాగా అనుభవించావు. లోతుపాతులు తెలుసుకున్నావు. ముందు వెనకలు చూచావు. మంచీ చెడూ గ్రహించావు. ఇకముందు అలాటి తప్పులు చెయ్యకు.

ముఖ్యంగా నిన్ను బాధిస్తున్న విషయం నీ తండ్రితో విరోధం :- దీనికి కారణం నీ పరిస్థితి. అంతే. నీ పరిస్థితి మారితే ఇలాటి బాధ లేమీ ఉండవు. యౌవనంలో కొన్ని సుఖాలకు లొంగిపోయావు. ఇందులో తప్పేమీలేదు. ఇది సహజమే. కాని మనం వయస్సునుబట్టి మారుతూ ఉండాలి. వినోద విలాసాలు అనుభవించే రోజులు గడిచిపోయాయి. నీవు పెద్దవాడివైనావు. నీవు ఇంకా వినోదాల్లో చిక్కుకుని ఉండడం ఉచితం కాదు. నీవు

ఒక వ్యక్తి వైనావని, పౌరుడివయ్యావని, సంఘానికి ప్రభుత్వా నికి సేవ చెయ్యాల్సిన బాధ్యత వున్నదనీ గమనించే వయస్సు వచ్చింది. నీవు వివాహం చేసుకుని కుదుటపడాలని మీ తండ్రి కోరిక. ఆయన సలహా మంచిది. నీ జీవితంలో ఒక అధ్యాయం గడిచిపోయింది. మరో అధ్యాయం ప్రారంభించింది. నీకష్టాలన్నీ ఈ సంధ్యా సమయానికి చిహ్నాలు. పాత జీవితం మరిచిపో. కొత్త జీవితం ప్రారంభించు. కొత్తబాటలో అడుగుపెట్టు. హాయిగా పెండ్లి చేసుకో. చిన్నతనపు పోకిరీపనులు మానుకో, వ్యాపారంలో, సాంఘిక వ్యవహారాల్లో, ప్రజాసేవలో, కళా విజ్ఞానాల్లో శ్రద్ధ చూపు. నీకు మళ్ళీ శాంతీ, స్తిమితం, ఆనందంవస్తాయి. నీ శత్రువు లందరూ నీ మిత్రులవుతారు. కాబట్టి నా ముఖ్యమైన సలహా ఇది: మీతండ్రి మాట విని వివాహం చేసుకో. క్రైస్తవుల్లో కలిసి నీవు వాంఛించే ఏకాంతం నీవు కావాలనుకుంటే, తత్వచింతన పట్ల నీకు అభిరతిఉంటే, జీవితాన్ని పూర్తిగా అనుభవించి అర్థం తెలుసుకున్నతరువాత వాటిని అన్వేషించవచ్చు. ఒక స్వతంత్ర పౌరుడుగా, కుటుంబపెద్దగా ఉన్నప్పుడే నీవు దాన్ని తెలుసుకోగలవు. తరువాత ఏకాంతవాసం నిన్ను ఆకర్షిస్తే అప్పుడే నీవు అందుకోసం వెళ్ళొచ్చు. అప్పుడే అది నిజమైన తత్వచింతన అవుతుంది. ఇప్పటిలాగా పట్టి విసుగుదలవల్ల కలిగిందికాదు. ఇక వెళ్ళు,' అని ఉపన్యసించాడు పరదేశి.

ఈ చివరి మాటలు జూలియన్‌కు జ్యోతుల్లా కనుపించాయి. అతని మాట ప్రకారం జూలియన్ ఇంటికి తిరిగి వెళ్ళాడు.

పట్టరాని ఆనందంతో తల్లి కొడుకును ఆహ్వానించింది. తన మాట ప్రకారం నడుచుకుంటాడని తెలిసి తండ్రికూడా పొంగిపోయాడు.

# 4

మూడు నెలలు గడిచాయి. జూలియస్‌కూ అందగత్తె యులంపియాకు వైభవోపేతంగా వివాహం జరిగింది. నూతన దంపతులు కొత్త ఇంట్లో ప్రవేశించారు. జూలియస్ తన తండ్రి వ్యాపారంలో ఒకశాఖ తన అజమాయిషీలోకి తీసుకున్నాడు. తన జీవిత విధానాన్ని పూర్తిగామార్చుకున్నాడు.

ఒక రోజు వ్యాపారంమీద ప్రక్క ఊరికి వెళ్ళాడు. ఒక దుకాణంలో కూచుని ఉండగా ఆ వీధిలో పోతూ పామ్ఫ్లియస్ కనుపించాడు. అతని ప్రక్కనే ఒక పిల్లకూడా ఉంది. ఆ పిల్ల ఎవరో జూలియస్‌కు తెలీదు. ఇద్దరూ బరువైన ద్రాక్షబుట్టలు మోసుకుని అమ్ముతూ పోతున్నారు. తన స్నేహితుణ్ణి చూడగానే జూలియస్ బైటికి వెళ్ళి అతన్ని పిలిచాడు.

పాంఫ్లియస్ జూలియస్‌తో మాట్లాడడానికి వెళ్ళడం అవసరమని గ్రహించి అతని ప్రక్కనున్నపిల్ల 'మీరు వెళ్ళిరండి. నేనిక్కడ కూచుని ద్రాక్షలు అమ్ముతుంటాను.' అన్నది. పామ్ఫ్లియస్ జూలియస్ దుకాణంలోకి వెళ్ళారు.

దుకాణం వెనకాల ఒక గదిలోకి వెళ్ళి కూచున్నారు. స్నేహితు లిద్దరూ ఒకరి క్షేమ సమాచారాలు ఒకరు విచారించుకున్నారు. పామ్ఫ్లియస్ ఇంకా క్రైస్తవ సంఘంలోనే ఉన్నాడు. ఇంకా వివాహం చేసుకోలేదు. తన జీవితం సుఖంగా

గడచిపోతున్నదని చెప్పాడు. ప్రతిక్షణం తన ఆనందం శాంతీ వృద్ధిపొందుతున్నా యన్నాడు.

జూలియస్ తనకు జరిగిన సంఘటన చెప్పాడు. తను క్రైస్తవుల్లో కలవాలని బయలుదేరడం, దారిలో ఒక పరదేశి తటస్థించడం, క్రైస్తవుల పొరబాట్లు ఎత్తిచూపడం—అంతా వివరంగా చెప్పాడు. అతని సలహా ప్రకారం తను వివాహం చేసుకున్నాననీ ఒక సంసారినైనా నని చెప్పాడు.

'ఇప్పుడు నీకు సుఖంగాఉందా? అపరిచిత వ్యక్తి చెప్పిన సౌఖ్యం నీకు వైవాహిక జీవితంలో దొరికిందా?' అని ప్రశ్నించాడు పామ్ఫిలియస్.

'సుఖం? సుఖం అంటే ఏమిటి? నాకోరికలన్నీ పూర్తిగా సంతృప్తికావడం సుఖమనుకుంటే నేను సుఖంగా లేననే చెప్పాలి. వ్యాపారం శ్రద్ధగా చేసుకుంటున్నాను. నా గౌరవం హెచ్చింది. నాకంటె శ్రీమంతులూ, సంఘంలో గౌరవం హెచ్చుగాఉన్నవారూ ఉండొచ్చు. కాని, నేనుకూడా వాళ్ళను మించే సూచనలున్నాయి. ఈవిషయంలో నాజీవితం బాగానేఉంది. కాని, వివాహ విషయం చెప్పాలంటే, నాకు సంతృప్తికరంగా లేదనేచెప్పాలి. మొదట్లో నాకు కనుపించిన సుఖం రానురాను అదృశ్యమైంది. సుఖం స్థానంలో దుఃఖంవచ్చి కూచుంది. నాభార్య అందగత్తె, తెలివిగలది, బాగా చదువుకున్నది కూడా. నేనంటే ఎంతో దయగా ఉంటుంది. మొదట్లోనాకు ఎలాంటి కొరతాలేదు. ఎంతోహాయిగా వుండేది కాని ఇప్పుడు—నీకుఅనుభవంలేదు—కొన్నికొన్ని భేదాభిప్రాయాలు వస్తున్నాయి. ఒక్కోసారి నేను తనపట్ల శ్రద్ధగా లేనంటుంది. మరోసారి

తక్కువ శ్రద్ధచూపుతున్నానంటుంది. ఇదేకాక వాంఛ ఎప్పుడూ నూతనత్వాన్ని కోరుతుంది. కొత్త రుచులు కావాలంటుంది. ఒక్కోసారి నాభార్య కంటే అందవిహీనురాలైన స్త్రీకూడా నన్ను ఆకర్షిస్తుంది. కాని తరువాత నాభార్య కంటెకూడా అధమసురాలవుతుంది. నాకు వివాహంలో శాంతి దొరకలేదు. తాత్వికులు చెప్పినమాట వాస్తవమే. హృదయం కోరేది జీవితం ఎప్పుడూ ఇవ్వదు. ఈ సత్యాన్ని నేను వివాహజీవితం ద్వారా తెలుసుకున్నాను. కాని, మీ మోసంకూడా సౌఖ్యం ఇస్తుందనే నమ్మకంలేదు.' అన్నాడు జూలియస్.

'మోసంఅంటే' అని అడిగాడు పామ్ఫిలియస్.

'జీవితంలోని తప్పులు తొలిగించడానికి బదులు మీరు జీవితాన్నే నిరాకరిస్తారు. అసలు వివాహాన్నే ఒప్పుకోరు' అన్నాడు జూలియస్.

'మేము పెండ్లిని నిరాకరించం.'

'కావచ్చు. కాని, ప్రేమను నిరాకరిస్తారు.'

'ప్రేమను నిరాకరించకపోగా స్వీకరిస్తాం. అంతటికీమూలం ప్రేమే నంటాం.?

'నాకు మీ మాటలు అర్థంకావు. నేను విన్నంతవరకూ నాకు తెలిసినంతవరకూ, మీ క్రైస్తవులు వివాహం చేసుకోరనుకుంటాను. నా వయస్సులో ఉండికూడా నీవు పెండ్లాడక పోవడం కనుపిస్తూనేఉంది. ఇంతకుమునుపే పెండ్లయిన వాళ్ళు అలాగే ఉంటారు. కాని కొత్తగామాత్రం ఎవరూ పెళ్ళి చేసుకోరు. మానవజాతిని అభివృద్ధి పరచడంలో మీకు శ్రద్ధలేదు.

మీరొక్కరే మనుష్యజాతిఅయినట్లవుతే మానవజాతి ఎప్పుడో నశించిఉండేది' అన్నాడు జూలియస్.

'నీవు చాలా అన్యాయంగా మాట్లాడుతున్నావు. మానవజాతిని సాగించడం మా ముఖ్యోద్దేశం కాకపోవచ్చు. మనం ప్రత్యేకంగా అందుకోసం శ్రమించనక్కరలేదు. ముఖ్యంగా మన కర్తవ్యం ఈశ్వరుని ఇచ్ఛానుసారంగా జీవించడమే. మానవ జాతి సాగడం. ఈశ్వరేచ్ఛ అవుతే సాగిపోతుంది. లేదా ఆగిపోతుంది. పెండ్లిని మేము నిషేధిస్తామన్నది చాలా పొరబాటు. పైగా, మా పెద్దలూ బోధకులూ ప్రోత్సహిస్తారుకూడా. పెండ్లి విషయంలో మాకూ మీకూ ఒక భేదం ఉన్నది. పరస్త్రీని కామదృష్టితో చూడడంకూడా పాపమని మేము భావిస్తాం. అందుకనే మేము తక్కువగా అలంకరించుకుంటాం. ఇతరులను ఆకర్షించడానికి అలంకరించుకోం. సోదర సోదరీ భావానికే ఎక్కువ ప్రాముఖ్యాన్ని ఇస్తాం,' అన్నాడు పామ్ఫిలియస్.

'కాని, సౌందర్యాన్ని ఆనందించకుండా ఉండలేం కదా. నీతో వచ్చిన అందగత్తె ఉందనుకో. నీలో వాంఛలు రేకెత్తించకుండా ఉంటుందా?'

పామ్ఫిలియస్ సిగ్గుపడి, నాకింకా తెలీదు. నేనింకా ఎప్పుడూ ఆమె అందాన్ని గురించి భావించలేదు. నాదృష్టిలో ఇంతవరకూ ఆమెని చెల్లెల్ని చూచినట్లు చూచుకుంటున్నాను. మీవాళ్ళు కామాన్నే ప్రేమనీ సౌందర్యమనీ అనుకుంటారు. కాని మాదృష్టి వేరు. మేము కామాన్ని పూర్తిగా నిరసించం. నిగ్రహించబడని కామం మనల్ని పతితులను చేస్తుంది. కామాన్ని సాధ్యమైనంతవరకూ తప్పుకోడానికి మేము ప్రయ

త్నిస్తాం. అందుచేతనే ఇంతవరకూ నేను పెండ్లి చేసుకోలేదు. ఇకముందు చేసుకోవచ్చు' అన్నాడు.

'కాని, దీన్ని నిర్ణయించే దెవరు?'

'ఈశ్వరేచ్ఛ.'

'ఈశ్వరేచ్ఛ ఫలానిదని మనకు ఎలా తెలుస్తుంది?'

'మనం ఈశ్వరేచ్ఛకోసం అన్వేషిస్తే దానంతట అదే మనకు గోచరిస్తుంది. మీకు మత పెద్దలున్నట్టు మాకూ మత పెద్దలున్నారు. మా పెద్దలు మా మత రహస్యాలు చెబుతారు.'

'కాని, ఇదంతా చూస్తోంటే నాకు అవ్యక్తంగా కనుపిస్తోంది. పెళ్ళి విషయం ఉందనుకో. ఎవరిని పెళ్ళిచేసుకోవాలో ఎప్పుడు చేసుకోవాలో ఎవరు చెప్పగలరు? నేను పెళ్ళిచేసుకోబోయేముందు మూడు సంబంధాలు వచ్చాయి. ముగ్గురిలో నేను యులంపియాను ఎన్నుకున్నాను. ముగ్గురు పిల్లల్లో అది అందంగా ఉంది. అంటే, నేను అందాన్నిబట్టి ఆకర్షణను బట్టి నా సంబంధం నిశ్చయించుకున్నా నన్నమాట. మరి, మీ రెలా చేస్తారో నాకు అర్థం కావడంలేదు?

'మా సిద్ధాంతం ప్రకారం ప్రపంచంలో మనుష్యులందరూ ఒకటే. దైహికంగా కాని, మానసికంగాకాని, అందరూ సమానులే. ప్రపంచంలో ఎవరు ఎవరినైనా పెండ్లి చేసుకోవచ్చు.

'అంటే?'

'మీ పెండ్లిండ్లకూ మాపెండ్లిండ్లకూ ఒక తేడా ఉంది. నీవు పెండ్లి చేసుకునేటప్పుడు నీకు వ్యక్తిగతంగా ఎక్కువ

సుఖాన్నిచ్చే పిల్లను ఎన్నుకుంటావు. మేము పిల్లను ఎన్నుకునే టప్పుడు ఇలా చెయ్యం. వ్యక్తిగత సౌఖ్యానికి ఎక్కువ స్థానం ఇవ్వం. పెండ్లి చేసుకుని ఈశ్వరేచ్ఛకు వ్యతిరేకంగా నడుచుకోకుండా ఉండడం ఎలాగా అన్నదే మాకు ముఖ్యమైన సమస్య. మనిద్దరం 'ఇలియడ్' గ్రంథం చదివాం. నీవు మరిచిపోలేదనుకుంటాను. 'ఇలియడ్' గ్రంథం ఏమిటి చెప్పు ? పెండ్లి చేసుకుని ఈశ్వరేచ్ఛకు వ్యతిరేకంగా నడుచుకోవడమే కదా.?

'ఈశ్వరేచ్ఛను అతిక్రమించడమంటే?'

'అతిక్రమణ ఇందులో ఉంది : పురుషుడు స్త్రీని తన వ్యక్తిగత సౌఖ్యంకోసం పెండ్లి చేసుకుంటున్నాడు కాని, స్త్రీ కూడా తనలాగే మనిషేననే భావంతో కాదు. ముఖ్యంగా అతను చూచుకునేది తన సుఖమే. కాని, మా ఉద్దేశంలో ఇలాంటి స్వార్థం తప్పు. మనిషి అందరినీ సోదర భావంతో ప్రేమించి నప్పుడే సంఘంలో సరియైన వివాహానికి స్థానం ఉంటుంది. ఇల్లు సురక్షితంగా ఉండాలంటే చక్కటి పునాది ఎలా అవసరమో వివాహ జీవితం న్యాయసమ్మతంగా ఉండాలంటే పరస్పరం ఒకరినొకరు ప్రేమించుకుని గౌరవించుకోడంకూడా అవసరం. ఈ పునాదిమీదనే క్రైస్తవ కుటుంబ జీవితం ఆధారపడి ఉన్నది.

ఒక స్త్రీమీద ప్రేమనంతా కేంద్రీకరించవచ్చు. కాని ఇతర మానవులందరినీ ప్రేమించడానికి అది అవరోధం కాగూడదు. కవులు చెప్పే దివ్యప్రేమ అప్పుడే నిజమైన దివ్య ప్రేమ అవుతుంది. ఒక్క స్త్రీని మాత్రమే ప్రేమించి, ఇతర మానవులను ప్రేమించకపోతే అది కేవలం కామమవుతుంది.

కాని ప్రేమకాదు. అది హింసకూ పరస్పర పీడనకూ దారి తీస్తుందికూడా. క్రైస్తవేతర వివాహంలో హింస పరస్పరపీడన గర్భితమై దాగిఉంటాయి. ప్రేమలేని పెళ్ళిళ్ళు దీనికి దారి తీస్తాయి.'

'మనుష్యులు తమవాంఛలు నిగ్రహించుకోడంసాధ్యమా'?

'వాంఛలకు పూర్తి స్వాతంత్ర్యమిస్తే అవి మనిషిని ఇష్టం వచ్చినట్టు ఆడిస్తాయి. కాని, మనం వాటిని నిగ్రహించ వచ్చు. ఉదాహరణకు తండ్రీ కూతుళ్ళ సంబంధాలు తీసు కుందాం. లేక అన్నా చెల్లెళ్ళ సంబంధాలు తీసుకుందాం. తల్లీ కొడుకుల సంబంధాలు తీసుకుందాం. ఇలాంటి సంబంధాలలో పవిత్రతకు తప్ప మరోభావానికి స్థానం ఉండదు. ఇలాగే మానవు లందరూ ఒకరి నొకరు పవిత్రంగా ప్రేమించుకోవచ్చు?

'ఇద్దరు ఒకే స్త్రీని ప్రేమిస్తే?'

'ఒకరు తమ ప్రేమను త్యాగం జేస్తారు?

'ఆ పిల్ల కూడా ఇద్దరిలో ఒకరినే ప్రేమిస్తుందికదా?'

'ఆ పిల్ల ప్రేమించని వ్యక్తి తన ప్రేమను ఆ పిల్ల సౌఖ్యం కోసం త్యాగం చేస్తాడు?

## 5

'సరే, కాని, అసలు నీ విషయం చెప్పు. నీతో ఒక అందమైన పిల్లను చూచాను. ఆ అమ్మాయికి నీవు భర్త కావాలనుకోకుండా ఉండగలవా?' అన్నాడు జూలియస్.

'నే నావిషయం ఆలోచించను. ఆఅమ్మాయి ఒక క్రైస్తవ విధవరాలి కూతురు. నీవుఅడిగావు కాబట్టి చెబుతున్నాను. ఆ అమ్మాయిని పెండ్లి చేసుకుందామనే భావంనాకు కలిగినమాట వాస్తవమే. కాని ఆ భావాన్ని నేను పెంచుకోలేదు. మరో యువకుడుకూడా ఆ పిల్లను ప్రేమిస్తున్నాడు. అతనికి బాధ కలిగేటట్టుగా నేను ప్రవర్తించకూడదు. అంత అవసరం వచ్చి నప్పుడు వివాహం చేసుకుంటాను. కాని ఆ విషయాన్ని గురించి ఆలోచించను. ముఖ్యంగా నేను అన్వేషించేది మానవప్రేమ ఒక్కటే.'

'కాని, ఆ పిల్ల తల్లి నీలాంటి శ్రమపడే యువకుడు తనకు అల్లుడవుతే ఎక్కువ సంతోషిస్తుం దనుకుంటాను.'

'నేనే కాదు, మాలో ఎవరైనా ఆ వృద్ధురాలికి సేవ చేస్తారు. ఆమె కూతురిని నేను పెండ్లి చేసుకోవలసివస్తే సంతో షంతో అంగీక రిస్తాను. మరొకణ్ణి పెండ్లాడినా ఎంత సంతో షంతో అంగీకరిస్తానో అంతే సంతోషంతో అంగీకరిస్తాను,

'ఇది అసాధ్యం. మీరు మిమ్మల్ని మోసం చేసు కోవడమేకాక ఇతరులనుకూడా మోసం చేస్తారు. ఆ పరదేశి నాతో చెప్పిందంతా వాస్తవమే. నీ మాటలు వింటూంటే నీవు వర్ణించే జీవితసౌందర్యంనన్ను ఆకర్షించింది. కాని తరువాత నింపాదిగా ఆలోచిస్తే అంతా మోసమనీ, జంతు జీవితానికి దారి తీసే అనాగరికతనీ అనిపిస్తుంది. మీ పద్ధతి మానవులను మళ్ళీ ఆదిమదశలోకి తీసుకుపోతుంది. మీరందరూ శ్రమద్వారా జీవిస్తున్నారు. అందుచేత కళా విజ్ఞానాలు అభివృద్ధి చేసు కునేందుకు మీకు తీరికఉండదు. నీవు చూడూ—చిరుగుబట్టలు

కట్టుకుని ఎలాఉన్నావో. అప్సరసలా ఉండవలసిన ఆ పిల్ల బానిస పిల్ల లా కనుపిస్తోంది. మీకు ఆట పాటలూ, అంద చందాలు, ఏమీలేవు; ఎప్పుడూ పని! పని! పని! ఇది మానవ నైజానికి విరుద్ధం'.

'మానవనైజం! బానిసలను అలసిపోయేట్టు పని చేయించడం, పరపీడన, పరస్పరహననం, మీ దృష్టిలో మానవనైజం! స్త్రీలను ఆటబొమ్మల్లా వాడుకోడం మీకు మానవనైజం, ఇదేనా మానవ నైజమంటే ? మేము కళలూ విజ్ఞానం ఒప్పుకోమనుకోడం చాలా పొరబాటు. మానవుని సహజ శక్తులన్నిటినీ మేము ఎంతో గౌరవిస్తాం. కాని మానవుని సహజ శక్తులన్నిటికీ కూడా ఒకే గమ్యం ఉంది. అది ఈశ్వరేచ్ఛ. కళలూ, శాస్త్రం కేవలం వినోదంకోసమని మేము భావించం. కళలూ శాస్త్రాలు, ఇతర విద్యల్లాగానే ప్రయోజనకరమైనవి. ఈశ్వర ప్రేమను, మానవ ప్రేమను ప్రతిఫలించాలి. నిజమైన శాస్త్రం మనల్ని ఇంతకంటె ఉన్నతమైన జీవితపథంలోకి తీసుకునిపోవాలి. మా విశ్రాంతి కాలాన్ని ఇలాటి కళలకే వినియోగిస్తాం. మా పాటలూ, పద్యాలూ, మా చిత్రాలు, మాకు దుఃఖసమయాలలో మనశ్శాంతి నిస్తాయి. మమ్మల్ని ఓదారుస్తాయి. మీలో విజ్ఞానవేత్తలు, ఇతర మానవులను హింసించే నూతన విధానాలు కనిపెట్టడానికి తమ శాస్త్రజ్ఞానాన్ని వినియోగిస్తారు. కొత్త కొత్త యుద్ధసాధనాలు కనిపెడతారు. ఇతరులను దోచుకుని శ్రీమంతులయ్యే మార్గాలు వెదుకుతారు. మీ కళలూ గుళ్ళూ, గోపురాలు అలంకరించడానికితప్ప మరెందుకూ పనికి రావు. మీ కళాకారులచేత నియంతల విగ్రహాలు చేయించి

స్థాపిస్తారు. మీ నాటకాల్లో పచ్చిశృంగారం తప్ప మరేమీ కనుపించదు. మీ చిత్రాలన్నీ మర్యాదస్తు డెవడూ చూడలేని బూతుబొమ్మలు, వేశ్యాగృహాల్లో అలంకరిస్తారు. ఇందుకోసం కాదుకళ.'

'నీవు చెప్పేదంతా ఒకపరిస్థితుల్లో నిజం కావచ్చు. ఇప్పుడు ఆ పరిస్థితులు లేవు. నీవు మా చట్టాలను, సంస్థలను, సైన్యాలను నిరసిస్తున్నావు. కాని మానవులకు రక్షణ అవసర మనే విషయం గమనించటంలేదు. మేము, మా సైనికులు రక్షణ ఇవ్వకపోతే మీరు ఇంతకాలం ఇలా ప్రశాంతంగా బ్రతకగలిగేవారు కాదు. ప్రభుత్వం మనల్ని రక్షిస్తూ ఉంది. నీవు గమనించడంలేదు. మీరు వ్యక్తిగత సంపత్తి ఒప్పుకోరు. కాని దాన్ని మీ స్వార్థంకోసం ఉపయోగించుకుంటారు. నీవు ద్రాక్షపండ్లు అమ్ముతున్నావుకాని ఊరికే పంచిపెట్టడంలేదు. ఇదంతావట్టిమోసం!' అన్నాడు జూలియస్ తీవ్రంగా.

పామ్ఫ్లియస్ అంతా విని, 'నీవు పొరబడుతున్నావు. ఎవరినీ భద్రత అడగక పోవడంలోనే ఉంది మా భద్రత. అవస రాలకోసం మాత్రమే మేము ద్రాక్షపళ్ళు అమ్ముతున్నాం. ఎవరైనా ఊరికేతీసుకోదలచుకుంటే నిరోధించకుండా ఇచ్చేస్తాం. మానవుని ఉనికికి అవసరమైన వస్తువులను, వ్యక్తిగత సంపత్తిపై ఆధారపడివ సాంఘికవ్యవస్థలో మాత్రమే ఉత్పత్తి చేయడానికి వీలవుతుందని నీవంటున్నావు. కాని, జీవితానికి అవసరవస్తువు లను ఎవరు ఉత్పత్తిచేసున్నారో ఒక్కమాటు ఆలోచించు. మన భోగభాగ్యాలన్నిటికీ కారణం ఎవరో ఒక్కమాటు ఆలో చించు. ఈ వస్తు సముదాయమంతా ప్రభువులు తయారు చేశా

రంటావా? బానిసలు తయారుచేశారంటావా?' పూటకూ టికోసం శ్రమించే బానిసలేకదా ఇవన్నీ ఉత్పత్తి చేసింది. మేమూ మీలాగే సుఖాన్ని అన్వేషిస్తున్నాం. కాని సుఖాన్ని గురించి మా అభిప్రాయానికీ మీ అభిప్రాయానికీ తేడా ఉంది. డబ్బులో గౌరవప్రతిష్టలలో సుఖం ఉండదని మీరనుకుంటారు. అహింసలో, త్యాగంలో సుఖం ఉందని మేము భావిస్తాం.'

తరువాత కాసేపు ఇద్దరూ మౌనంగా కూర్చున్నారు. 'నీవు సుఖంగా ఉన్నావా?' అన్నాడు జూలియస్.

'ఇంతకంటె నేను కోరేదేమీ లేదు. ఒక్కోసారి ఇంత సుఖం నాకొక్కడికే ఉండడం అన్యాయమనికూడా అనిపిస్తుంది' అన్నాడు పాంఫ్లియస్.

'కావచ్చు. ఆ పరదేశి కలవకుండా ఉంటే నేనుకూడా మీదగ్గరికి వచ్చి సుఖపడేవాణ్ణేమో.'

'రాకూడదా?'

'మరి నాభార్య విషయం?'

'ఆమెకు క్రైస్తవమతంపట్ల అభిమానం ఉందన్నావు కదా.'

'అవును. అయినా అప్పుడే కొత్త జీవితం మొదలెట్టాం. ఇప్పుడు హఠాత్తుగా ఈ జీవితానికి స్వస్తి చెప్పడం కష్టం'

ఈలోగా పాంఫ్లియస్ స్నేహితురాలు వచ్చింది. ఆ పిల్లతో మరో కుర్రాడుకూడా వచ్చాడు. పాంఫ్లియస్ బైటికి వెళ్ళాడు. ద్రాక్షపండ్లు అమ్మామనీ, గోధుమ కొన్నామనీ

చెప్పాక. పామ్ఫ్లియస్ ఆ పిల్లను ఇంటికి తీసుకుని వెళ్ళమని కుర్రాడితో చెప్పాడు.

'మాగ్డలీన్‌ను నీవే తీసుకురా?' అని ఆయువకుడు వెళ్ళి పోయాడు.

జూలియస్ పామ్ఫ్లియస్‌ను ఒక వర్తకుని దుకాణానికి తీసుకుని వెళ్ళాడు. గోధుమలు బస్తాల్లో పోశారు. మాగ్డలీన్ ఒక చిన్న బస్తా ఎత్తుకుంది. పామ్ఫ్లియస్ పెద్దబస్తా ఎత్తు కున్నాడు. జూలియస్ దగ్గర సెలవు తీసుకుని వెళ్ళారు. వీధి మలుపులో పామ్ఫ్లియస్ వెనక్కు తిరిగి చిరునవ్వు నవ్వాడు. మాగ్డలీన్‌తో ఏదో చెప్పాడు.

'నేను వాళ్ళతో వెడితే బావుండేది' అనుకున్నాడు జూలియస్. అతని కళ్ళముందు రెండు దృశ్యాలు కనుపించాయి. బస్తాలు మోసుకునిపోతున్న పామ్ఫ్లియస్, ఆ పిల్ల— ఇద్దరి సుందరవదనాలూ—మరో వైపు తను మళ్ళీ ఇంటికి వెళ్ళడం, అలసటతో ఆందోళనతో సోఫామీద పడుకునిఉన్న తన భార్య ముఖం—రెండూ కనిపించాయి.

కాని జూలియస్ ఆలోచించలేకపోయాడు. కొందరు వరకులు వచ్చేసరికి వాళ్ళతో కలిసి ఆ రాత్రి తాగుతూ, విందులతో, వినోద విలాసాలతో గడిపాడు.

## 6

పది సంవత్సరాలు గడిచాయి. జూలియస్ మళ్ళీ పామ్ఫ్లియస్‌ను కలుసుకోలేదు. ఆ స్మృతికూడా మాసిపోయింది.

జూలియస్ జీవితం యథాతథంగానే నడుస్తోంది. ఈ పది సంవత్సరాలలో తండ్రి చనిపోయాడు. వ్యాపారమంతా తనే చూచుకోవలసివచ్చింది. వ్యాపారం పెద్దది. వ్యాపారస్థులు, ఇతరదేశాలనుంచికూడా ఎందరో వచ్చి పోతుంటారు. కొన్ని అప్పులు వసూలు చెయ్యాలి. కొన్ని చెల్లించాలి. జూలియస్‌కు తీరిక ఉండడంలేదు. పగలూ రాత్రీ వ్యాపారం పని మీదే గడపాలి. పైగా కొత్తబాధ్యతలు వచ్చి పడ్డాయి. ఒక ఆఫీసుకు ఎన్నికైనాడు ఈ కొత్తపదవి అతన్ని ఆకర్షించింది. వ్యాపారంకాక, ప్రజావ్యవహారాలలోకూడా అతను పాల్గొంటున్నాడు. తనకు సభల్లో చక్కగా మాట్లాడడం కూడా వచ్చు. తనతోటి వారిలో ఎంతో గౌరవం సంపాదించాడు. పెద్ద ఉన్నతపదవికి వెళ్ళే సూచనలుకూడా ఉన్నాయి. తన కుటుంబజీవితంలో మాత్రం ఒక శోచనీయమైన మార్పు వచ్చింది. అతనికి ముగ్గురు పిల్లలు కలిగారు అందుకని తనకూ తన భార్యకూ దూరం ఏర్పడింది. తన భార్య అందం చాలా వరకు తగ్గిపోయింది. అదీకాక, ఇప్పుడు తనపట్ల అంత శ్రద్ధ చూపడంలేదు. శ్రద్ధంతా పిల్లలమీదనే చూపుతోంది. ఇంట్లో ఆయాలు ఉన్నా, పిల్లలు ఎప్పుడూ తల్లి దగ్గరే ఉంటారు. పిల్లల వల్ల సుఖంకంటె గొడవ ఎక్కువగా కనుపించింది జూలియస్‌కు.

వ్యాపారంలో, సంఘవ్యవహారాల్లో పడి జూలియస్ తన పాతజీవితాన్ని మానేశాడు. కాని తను వీటికోసం శ్రమించిన తరువాత కొద్దిగా విలాసం కావాలనుకున్నాడు. తనభార్య వల్ల ఇలాంటి ఉల్లాసం దొరకదు. తనభార్యకూ ఆమె క్రైస్తవ కానిసపిల్లకూ స్నేహంఏర్పడింది. అంచాత ఆమెకూడా పూర్వ

జీవితాన్ని వదిలి విరక్తిగా ఉంటోంది. జూలియస్ ఒక క్రొత్త విలాసినితో సంబంధం పెట్టుకుని, తన విశ్రాంతి సమయాన్ని ఆ అమ్మాయితో గడుపుతున్నాడు.

అతనికి వక్క నిమిషంకూడా తీరిక ఉండడంలేదు. అతనికి శాంతి కనుపించడంలేదు. అస్తమానం పనులు. ఈ పనులు ఎప్పుడు వదిలిపోతాయా అనుకునేవాడు. జీవితం బరువుగా బద్ధకంగా గడుస్తున్నట్టు తోచేది.

ఇలా ఉండగా ఒక విచిత్ర సంఘటన అనుకోకుండా జరిగింది. అతను ఒలంపిక్ ఆటల పందాలకు వెళ్ళాడు. తనరధం నడుపుతూఉండగా మరోరధానికి ఢీకొంది. చక్రం విరిగిపోయింది. జూలియస్ కిందపడ్డాడు. అతని చెయ్యీ, రెండు ప్రక్కటెము కలూ విరిగాయి. మూడు నెలలు అతను మంచంలో ఉండాల్సి వచ్చింది.

ఈ మూడు నెలలూ, అతని దేహం బాధపడుతున్నా, అతని మనస్సుకు విశ్రాంతి చిక్కింది. తన జీవితాన్ని గురించి అనాసక్తంగా ఆలోచించుకోడానికి వీలు కలిగింది తన జీవిత మంతా అతనికి విషాదకరంగా కనుపించసాగింది. మరో మూడు సంఘటనలు అతన్ని మరింతగా క్రుంగదీశాయి.

ఒక బానిస ఆఫ్రికాలో తను పుచ్చుకున్న విలువగల వజ్రాలు దొంగిలించాడు. తన వ్యాపారానికి పెద్ద నష్టం కలిగింది.

తన ఉంపుడు కత్తె తన్ను వదిలిపెట్టి మరొకని అండ చేరింది.

తను జబ్బుగా ఉన్న సమయంలో ఒక ఎన్నిక జరిగింది. తన ప్రతికూలుడు ఎన్నికలో గెలిచాడు.

దీనికంతా కారణం ? ఒక్క అంగుళం మేరలో రథం ఢీకొంది, లేకుంటే ఇలా జరిగేదా ?

పక్కమీద ఏకాంతంగా పడుకుని జూలియస్ ఆలోచించడం మొదలెట్టాడు.

తన సుఖం ఇలాంటి చిన్న చిన్న సంఘటనలపై ఆధారపడి ఉంది. జూలియస్‌కు తన పూర్వపు సంఘటనలు జ్ఞాపకం వచ్చాయి — తను క్రైస్తవుల వద్దకు వెళ్ళడానికి బయలుదేరి తిరిగి రావడం మొదలైనవి. పామ్‌ఫ్లియస్ కూడా జ్ఞాపకం వచ్చాడు. పామ్‌ఫ్లియస్‌ను కలుసుకుని పది సంవత్సరాలైంది.

ఇప్పుడు జూలియస్ మంచంలో ఉండడంవల్ల తన భార్య ఎప్పుడూ దగ్గరే ఉంటోంది. తన క్రైస్తవ మతాన్ని గూర్చి బానిస పిల్ల దగ్గర నేర్చుకున్న విషయాలన్నీ జూలియస్‌కు చెబుతోంది.

ఆ బానిసపిల్లకూడా కొన్నాళ్ళు వాళ్ళతో నివసించింది. ఆ పిల్లకు పామ్‌ఫ్లియస్‌ను తెలుసు. జూలియస్ ఆ పిల్లను పిలిపించి విషయాలన్నీ వివరంగా చెప్పమని అడిగాడు. ముఖ్యంగా పామ్‌ఫ్లియస్‌ను గురించి అడిగాడు.

పామ్‌ఫ్లియస్ చాలా మంచివాడనీ అందరూ అతన్ని ఎంతో గౌరవిస్తారనీ ఆ పిల్ల చెప్పింది. అతను మాగ్దలీన్‌నే వివాహం చేసుకున్నాడట. పిల్లలుకూడా కలిగారట.

జూలియన్ ఒంటిగా పడుకుని ఆలోచించడం మొద పెట్టాడు. తన జీవితాన్నీ ఫామ్ఫిలియస్ జీవితాన్నీ పోల్చుకున్నాడు.

మనస్సు మరల్చుకోడానికని తనప్రక్కన భార్య చదువుతూ ఉంచిన గ్రీక్ వ్రాతప్రతిని తీసుకుని చదవడం మొదలెట్టాడు. జీసస్ పన్నెండుగురు ముఖ్య శిష్యుల బోధల్లో మొదటి భాగం ఇది:

ఆ గ్రంథంలో ఇలా ఉంది: 'రెండేరెండు దోవలున్నాయి. ఒకదోవ జీవితానికి; ఒకదోవ మృత్యువుకూ దారితీస్తుంది. జీవితం దోవ ఇది: దేవుని ప్రేమించు. నీ తోటి మానవుని ప్రేమించు. నీకు బాధ కలిగిస్తాయనుకున్నవి నీతోటి మానవునికి చెయ్యకు. నిన్ను తిట్టేవారిని ఆశీర్వదించు. నిన్ను ద్వేషించే వారిని ప్రేమించు. పరిహాసం చేయకు. చంపకు, వ్యభిచారం చెయ్యకు. అడిగినదల్లా ఇచ్చెయ్యి. శాంతిని ప్రసాదించు. మృత్యువు మార్గం ఇది: భయం, వ్యభిచారం, దొంగతనం, హత్య, హింసలన్నీ ఈ మార్గంలో ఉన్నాయి.

జూలియన్ ఈ గ్రంథం పఠించి తన్మయుడై పోయాడు. అతని ఆత్మ రెక్కలు కట్టుకుని ఎక్కడికో ఎగిరినట్లనిపించింది. జూలియన్ అంతరాత్మ ఆ మాటలు చెప్పిన మహాత్ములతో కలిసి విలీనత పొందింది.

'నే నిక నా జీవితాన్ని ధ్వంసం చేసుకోలేను. నవజీవన మార్గాన్ని అనుసరిస్తాను' అనుకున్నాడు. ఫామ్ఫిలియస్ మాటలు జ్ఞాపకం వచ్చాయి.

'జీవితాన్ని అనుభవించిన తరువాత నీవు వెళ్ళొచ్చు' అని పరదేశి చెప్పిన మాటలుకూడా జ్ఞాపకం వచ్చాయి. తను జీవితం అనుభవించాడు కాబట్టి ఇక వెళ్ళొచ్చు అనుకున్నాడు.

తన ఉద్దేశం భార్యకు చెప్పాడు. ఆమె అన్నిటికీ ఒప్పుకుంది. కాని పిల్లల విషయం? వాళ్ళను తీసుకుని వెళ్ళడం ఎలా? వాళ్ళను ఎవరి జాగ్రత్తలో వదిలి వెళ్ళాలి? జూలియస్ తల్లి జాగ్రత్తలో పిల్లల్ని వదిలి వెళ్ళడానికి నిశ్చయించుకున్నారు.

అంతా నిశ్చయమై పోయింది. ఇక జూలియస్ రుగ్మత నయం కావడమే తరువాయి.

# 7

ఇలాంటి స్థితిలో జూలియస్ నిద్రపోయాడు. తెల్లవారి లేవగానే ఒక గొప్ప వైద్యుడు వచ్చాడని చెప్పారు. జూలియస్ అతన్ని పిలవనంపాడు. ఆ వైద్యుడు జూలియస్‌ను పూర్వం కలుసుకున్న అపరిచితవ్యక్తే. వైద్యుడు జూలియస్‌ను బాగా పరీక్షించి మూలిక లిచ్చాడు.

'నా చేతులతో పని చెయ్యగలనా?' అని అడిగాడు జూలియస్.

'తప్పకుండా. వ్రాయగలవు; రథం తోలగలవుకూడా'.

'మోటుపనులు చెయ్యగలనా? త్రవ్వడం—అలాంటివి'.

'నీ అంతస్తులో వ్యక్తులకు అలాంటి అవసరాలే ఉండవు'.

'కాదు అవసరం ఉంది.'

ఆ వైద్యుని సలహా ప్రకారం తను జీవితం అనుభవించాననీ, జీవితంలో శాంతి సౌఖ్యాలు దొరకలేదనీ, మళ్ళీ క్రైస్తవుల్లో కలిసే నిశ్చయానికి వచ్చాననీ చెప్పాడు జూలియస్.

'నీకు ఇంత గొప్ప అంతస్తూ ఇన్ని బాధ్యతలూ ఉండి కూడా నీవు వీళ్ళ మోసంలో చిక్కినట్టుగా కనుపిస్తున్నావు. ముఖ్యంగా నీ పిల్లల విషయం నీవు ఆలోచించడమేలేదు' అన్నాడు వైద్యుడు.

'ఈ పుస్తకం చదవండి' అంటూ జూలియస్ తన గ్రంథాన్ని వైద్యునికిచ్చాడు.

వైద్యుడు గ్రంథాన్ని ఒక్కమాటు పరకాయించిచూచి, 'ఈ మోసమంతా నాకు తెలుసు. కాని నీలాటివాడు ఇందులో ఎలా పడ్డాడా అని ఆలోచిస్తున్నాను?' అన్నాడు.

'మోసం ఎక్కడుంది?'

'ఈ సిద్ధాంతాలన్నీ ఇదివరకే పరీక్షించబడి తప్పుగా తేల్చబడ్డాయి. ఈ సిద్ధాంతాలు కల్పించినవాళ్ళు మానవులకూ దేవతలకూ ఎదురు తిరిగినవాళ్ళు. మనుష్యులందరూ సుఖంగా ఉండాలంటే యుద్ధాలు, దారిద్ర్యం, ఘర్షణ మొదలైనవి ఉండ కూడదు అంటారు. కాని ఇలాటి స్థితి క్రీస్తు ధర్మాన్ని అనుస రించినప్పుడే వస్తుందంటారు, సాధ్యమే, సాధనమని పొరబడి తమనూ ఇతరులనూ మోసంచేస్తారు. నిజం ఆలోచిస్తే సాంఘిక జీవితం ద్వారానే వీరి ఆశయాలు నెరవేరుతాయి. సూటిగా వదిలితే బాణం తప్పకుండా తగులుతుందంటారు. కాని సూటిగా వదలడం ఎలా? ఈ విషయం ఆలోచించరు. సూటిగా బాణం వెళ్ళాలంటే చక్కటి ధనస్సుకూడా అవసరం. జీవితంలోకూడా

ఇంతే. పరిపాలకులు, ప్రభుత్వం, న్యాయం ఉన్నప్పుడే జీవితం సాఫీగా నడుస్తుంది. ఇవన్నీ నాశనంచేస్తే ఇక జీవితం ఎలా బావుంటుంది ?'

'అందరూ క్రీస్తుధర్మాలను అనుసరిస్తే పరిపాలకులు, ప్రభుత్వం, న్యాయచట్టాలులేకుండానే జీవితంబావుంటుందంటాడు.'

'అందరూ అనుసరిస్తారని నమ్మకం ఏమిటి.? అనుసరించకపోతే' జూలియస్ మనస్సు కొద్దిగా ఊగిసలాడింది. వైద్యుడు ఇలా చెప్పాడు. 'ఒకవేళ క్రైస్తవ సిద్ధాంతాలను మందులాగా అందరికీ ఎక్కిస్తామనుకో; ప్రపంచంలో మనుష్యులందరూ క్రీస్తు బోధలు అనుసరించి భగవంతునీ తోటి మానవులనూ ప్రేమించడం మొదలెడతారనుకో. ఇదంతా మనం నిజంగా జరుగుతుందని అనుకున్నా; అప్పుడుకూడా దానివల్ల మానవజాతికి ముప్పువస్తుంది. ప్రపంచంలో జీవితమే అస్తమించిపోతుంది. మానవజాతే నశించిపోతుంది. ఈ క్రైస్తవుల గురువు ఒక దేశదిమ్మరి కుర్రాడు. అతని అనుచరులూ అలాంటివాళ్ళే. ప్రపంచమంతా అలాంటి వాళ్ళతో నిండిపోతుంది. తల్లులనీ, పిల్లలనీ, కుటుంబాలనీ, ఇలాంటి వేవీ ఉండవు. అంతా కలగాపులగమవుతుంది. స్వంత పిల్లలనైనా ఇతరుల పిల్లలనైనా ఒకేరకంగా చూసుకోవాలంటారు. ఇదెలా సంభవం? తల్లులప్రేమ నశించిపోవాల్సిందే. ఒక జబ్బుపిల్ల ఉంటే, స్వంతతల్లి తప్ప పరాయితల్లి సాకడం సాధ్యమవుతుందా? స్వంత తండ్రులుతప్ప పరాయితండ్రులు పిల్లలకు విద్యాబుద్ధులు గరపగలరా ? కాబట్టి నీవు ఈ కల్లిబొల్లి కబుర్లు వినకు, సహజంగా హేతుయుక్తంగా జీవించు.

నీకు అనేక బాధ్యతలున్నాయి. ఇది ఒక దశ. నీకు మళ్ళీ సందేహాలు వస్తున్నాయి. కొద్దికాలంలో వాటంతట అవే మటుమాయమైపోతాయి. ముందు నీపిల్లలకు చదువు చెప్పించి పెద్దవాళ్ళను చెయ్యి. మంచి దేశసేవకులుగా వాళ్ళను తయారు చెయ్యడం నీ బాధ్యత. ఇంతేకాక నీవు సంఘసేవకూడా చెయ్యాలి. సంఘానికి దూరంగా పోకూడదు. ఒకటి సాధించాలంటే కొన్నినష్టాలు కష్టాలు వస్తాయి. మనం అధైర్యపడి ఆ పనివిడిచిపెట్టకూడదు. భాధ్యతలనూ విధ్యుక్తధర్మాలను విడిచి పెట్టరాదు. క్రైస్తవుల వైరివాగుడు నీ భార్యకు విడిచిపెట్టు.

# 8

వైద్య మూలికలవల్లనైతేనేమి, అతని సలహావల్లనైతేనేమి జూలియస్ గాయాలు త్వరగా నయమైనాయి.

కొన్నాళ్ళతరువాత వైద్యుడు ఆ నగరంనుంచి వెళ్ళాడు. జూలియస్ నెమ్మదిగా లేచి తిరుగుతున్నాడు. వైద్యుని సలహా ప్రకారం నడుచుకుంటున్నాడు. పిల్లలను ఒక గురువు దగ్గర చదువుకు కుదిరించాడు. తను స్వయంగాకూడా శ్రద్ధ తీసుకుంటున్నాడు.

తను ప్రజావ్యవహారాలలో మళ్ళీ కాలం గడుపుతున్నాడు. కొద్దికాలంలోనే నగరంలో గొప్ప ప్రతిష్ఠవచ్చింది.

ఇలా ఒక సంవత్సరం గడిచింది. ఈ సంవత్సరములో జూలియస్ క్రైస్తవులనుగురించి తలుచుకోనైనా తలుచుకోలేదు. ఆ సంవత్సరం చివరలో రోమన్ చక్రవర్తి ప్రతినిధి ఒకడు

క్రైస్తవోద్యమాన్ని అణచడానికి సైలీసియా వచ్చాడు. ఒక పెద్ద విచారణకోర్టు ఏర్పరచబడింది. జూలియన్ పీటిల్లో అంత శ్రద్ధ కలిగించుకోలేదు.

ఈ విచారణతో పామ్ఫిలియస్‌కు సంబంధం లేదనుకున్నాడు. కాని, ఒకరోజు తన పనిమీద వెడుతూవుండగా, ఒక వ్యక్తి దగ్గరికి రావడం చూశాడు. ఆ వ్యక్తి చాలా పేద దుస్తులు వేసుకుని ఉన్నాడు. దగ్గరికి వచ్చేవరకూ జూలియన్ అతన్ని గు ర్తిం చ లే దు. అ త ను పామ్ఫిలియన్. అతనితో ఒక కుర్రాడుకూడా ఉన్నాడు. అతను జూలియస్ దగ్గరకువచ్చి 'నమస్కారం, స్నేహితుడా! నీవల్ల నాకొక సహాయంకావాలి. క్రైస్తవులను హింసిస్తూఉన్నారు. నీవునన్ను స్నేహితుడుగా గుర్తిస్తావో గుర్తించవో?' అన్నాడు.

'నాకు ఎవరన్నా భయంలేదు. కావలసిఉంటే నాఇంటికి రా. నీకు కావలసిన సహాయంచేస్తాను. ఈ కుర్రాడు ఎవరు?' అని అడిగాడు జూలియస్.

'నా కొడుకు.'

'అచ్చం నీలాగే ఉన్నాడు. నీభార్య పూర్వం నేను చూచిన అమ్మాయేకదూ?'

'అవును. నిన్ను కలుసుకున్న తరువాత కొద్ది రోజులకే ఆ అమ్మాయిని పెండ్లి చేసుకున్నాను.'

ఇద్దరూ ఇంటికి వెళ్ళారు. జూలియస్ భార్యను పిలిచి కుర్రాణ్ణి లోపలికి పంపించాడు. తరువాత పామ్ఫిలియస్‌ను తన గదిలోకి తీసుకుని వెళ్ళాడు. 'ఇక్కడ మనం హాయిగా మాట్లాడుకోవచ్చు. ఎవరూ వినరు' అన్నాడు.

'ఎవరైనా వింటారని నాకు భయంలేదు. నేను కోరేదల్లా ఒకటే. అరెస్టుచేసిన క్రైస్తవులను విచారించి ఉరితీయకూడదని నేననను. కాని వాళ్ళ మతాన్ని గురించి బహిరంగంగా చెప్పే హక్కు వాళ్ళకివ్వాలి.'

వారి పెద్ద సైరిల్, పామ్ఫిల్లియస్‌ను జూలియస్‌తో ఈ విషయం మాట్లాడమని పంపించాడు. విచారణ, ఉరిశిక్ష బహిరంగంగా జరపాలని పామ్ఫిల్లియస్ కోరాడు.

అతని కోరిక జూలియస్‌ను ఆశ్చర్యపరిచింది. తన శాయశక్తులా యత్నిస్తానన్నాడు.

జూలియస్ ఇలా అన్నాడు: నేను నీకు తప్పకుండా సహాయంచేస్తాను. నీవు నాకు ఆప్తమిత్రుడివి. కాని మీసిద్ధాంతాలు కేవలం అర్థరహితమైనవని నాఉద్దేశం. మానవ స్వభావంలో వైరుధ్యముంది. ఈవైరుధ్య ఫలితంగా ఘర్షణ వస్తుంది. మీరు ఈ ఘర్షణలో పాల్గొనడానికి అంగీకరించరు. విశ్వవ్యవస్థలో మీరు పాలుపంచుకోకుండా దాని తాలూకు ఫలితాలు మాత్రం అనుభవించడానికి సిద్ధపడతారు. ఇది స్వార్థంకదూ. పరిపాలకులనేవాళ్ళు ఉండబట్టే మన లోకం ఇలా సాఫీగా సాగిపోతోంది. మనల్ని శత్రు దేశాలనుంచీ శత్రువులనుంచీ, రక్షిస్తున్నారు. మీరు పరిపాలకులను ప్రభుత్వాన్ని ఒప్పుకోరు. అహంకారంతో అందరూ సమానులంటారు. మీరు చక్రవర్తితో సమానులమంటారు. ప్రతి సోమరిపోతుకూ, బానిసకూ ఇది ఎంతో ఆకర్షణీయంగా కనుపించి మీలో చేరిపోతారు. ప్రజలంతా మీమాట వింటే సంఘం క్షణంలో పేక మేడలా

కూలిపోతుంది. ఒక ప్రభుత్వం నీడలో బ్రతుకుతూ ఆ ప్రభుత్వాన్నే నిరసిస్తారు.

పామ్ఫ్లియస్ ఇలా జవాబు చెప్పాడు. 'నీవు మమ్మల్ని పూర్తిగా అపార్థం చేసుకున్నావు. హింస లేకుండానే మేము జీవనోపాధిని సృష్టించగలం. అందరం కలిసి పని చెయ్యడం ద్వారా కావలసినంతగా ఉత్పత్తి చెయ్యగలుగుతాం. మాలోని వృద్ధులకూ, జబ్బు మనుష్యులకూ, బలహీనులకూ, వికలాంగులకూ కూడా సరిపోయేటంత ఉత్పత్తిచేస్తాం. పరిపాలకులు శత్రువుల నుంచి మనల్ని కాపాడుతారంటావు. కాని మేము శత్రువులను ప్రేమిస్తాం జాలిపడతాం. కాబట్టి మాకు శత్రువులేలేరు. మేము అహంకారానికి పూర్తిగా వ్యతిరేకులం. వినయం, విధేయత మా ఆదర్శాలు. మానవులందరూ పరస్పరం ప్రేమించుకుని కలిసిఉండడం పైనే విశ్వశ్రేయస్సు ఆధారపడిఉన్నదని మా ఉద్దేశం. నిజానికి హింసను ఎదుర్కోడానికి మా మార్గంకంటె ఉత్తమమార్గంలేదు. ఉదాహరణకు రోమన్ సామ్రాజ్యాన్ని తీసుకుందాం. రోమన్‌లో ఉన్నన్ని న్యాయచట్టాలు మరెక్కడా లేవు. న్యాయం ఒక పెద్దశాస్త్రం. ప్రతి పాఠశాలలో న్యాయ చట్టాలనుగురించి బోధిస్తారు.

కాని, ప్రపంచం మొత్తంమీద రోమన్ నగరంలో జరిగేటంతపాపం మరెక్కడా జరగదు. పాపకార్యాలకు కేంద్రం రోమ్. రోజు రోజుకూ నేరాలు పెరుగుతున్నాయి కాని, తగ్గడంలేదు.

'ప్రేమవల్లనే మనం నేరాన్నీ పాపాన్నీ జయించగలం. ప్రతీకారం ఇందుకు మార్గంకాదు.'

జూలియస్ పామ్ఫ్లియస్ మాటలన్నీ విని, 'నీమాటలు వింటోంటే నీవు చెప్పేదంతా నిజమేననిపిస్తుంది. కాని అందరూ మీకు వ్యతిరేకులుగా ఎందుకున్నారో నాకు అర్థం కావడం లేదు,' అన్నాడు.

'దీనికి కారణం మేము కాదు. ఈ బాహిరమైన న్యాయ చట్టాలకు అతీతమైన చట్టాలు ఉన్నాయి. అవి మానవుని అంతరాత్మలో ఉన్నాయి. ఆ చట్టాలు శాశ్వతాలు. మానవు లందరికీ సహజమైనవి. మేము ఈ న్యాయ సూత్రాలనే అనుస రిస్తాం. సాధారణమైన న్యాయచట్టం దేశాన్నీ; సంఘాన్నీ పరి పాలిస్తుంది. కాని, దేవుని న్యాయచట్టం, హృదయాన్నీ అంత రాత్మనూ పాలిస్తుంది. కొన్ని న్యాయచట్టాలు మాత్రమే ప్రధానమనుకుంటారు కాబట్టి మానవులు మమ్మల్ని ద్వేషి స్తారు. మేమంటే భయపడతారు. మేము ఏమానవుణ్ణీ ద్వేషించం. మమ్మల్ని హింసించేవాళ్ళనుకూడా ద్వేషించం. మా జీవన విధానం వారికి కంటకింపుగా ఉండటంవల్లనే మానవులుమమ్మల్ని ద్వేషిస్తారు, జీసస్‌నుకూడా ఇలాగే ద్వేషించారు. కాని, ఒకనాటికి సత్యం జయించకపోదు.' అన్నాడు పామ్ఫ్లియస్.

## 9

ఈలోగా పామ్ఫ్లియస్ కొడుకు ఆ గదిలోకి వచ్చాడు. జూలియస్ పామ్ఫ్లియస్‌ను భోజనానికి ఉండమన్నాడు. 'నీకు భార్యాబిడ్డలు ఉండడం నాకు ఆశ్చర్యం కలిగిస్తోంది. ఆస్తి లేకుండా క్రైస్తవులు సంసారాన్ని ఎలా పోషించగలుగుతారో

నాకు అర్థం కావడంలేదు. మీకు బానిసలూ లేరు. ఆస్తీ లేదు: నాభార్యకు మీమతమంటే అభిమానం. ఒకప్పుడు మీలో కలుద్దామనికూడా అనుకుంది. నేనుకూడా ఆమెతో కలిసివచ్చే దామనుకున్నాను. కాని నాభార్యా పిల్లల భవిష్యత్తును గురించి భయపడింది. అది నాకు జబ్బుగాఉన్న సమయం. ఒక వైద్యుడు నాకు ఒక సలహానిచ్చాడు. సంసారంలేని వాళ్ళకు మీమతం మంచిదికావచ్చు కాని, కుటుంబీకులకు మంచిదికాదన్నాడు. మీ పద్ధతి ప్రకారం నడిస్తే, ఒకనాటికి మానవజాతి పూర్తిగా నశించి పోతుందన్నాడు. నీకూ కుటుంబం ఉండడం నాకు ఆశ్చర్యం కలిగిస్తోంది' అన్నాడు జూలియన్.

దీనికి పామ్ఫ్లియన్ 'మనం పెద్దవాళ్ళం - చెడిపోయింది కాక చిన్నపిల్లల్నికూడా ఇదే వాతావరణంలో పెంచి చెడ గొట్టడం తప్పు. జీవించడానికి నాదృష్టిలో ఒకటే మార్గం ఉంది. అది ఇతర మానవులకోసం ప్రేమపూర్వకంగా పని చెయ్యడమే. అన్నిటికీ మూలం ప్రేమ అని మాఉద్దేశం. సోదర ప్రేమ - శ్రమ - ఈ రెండిటిమీదనే మానవ శ్రేయస్సు ఆధారపడి ఉంది. పని చేసేవాళ్ళకు పనివల్ల బ్రతికేవారికీ కుటుంబ పోషణ కష్టంకాదు. పని చెయ్యనివారికే కుటుంబపోషణ కష్టం' అన్నాడు.

జూలియన్ కాసేపు మౌనంగా ఊరుకున్నాడు. 'సత్యం ఒక్కటే మనకు విముక్తి కలిగిస్తుంద'న్నాడు పామ్ఫ్లియన్. కొడుకును తీసుకుని వెళ్ళిపోయాడు.

క్రైస్తవులను బహిరంగంగా విచారించి ఉరితీశారు. పామ్ఫ్లియన్ శవాలు తీసుకుని వెళ్ళడం జూలియన్ చూచాడు.

# 10

మరో ఇరవై సంవత్సరాలు గడిచాయి. జూలియస్ భార్య చనిపోయింది. జూలియస్ జీవితం అలాగే సాగుతోంది. అతను ప్రజాజీవితంలో పాల్గొంటూనే ఉన్నాడు. ఒక్కొక్కప్పుడు అధికారం వచ్చినట్టుగా కన్పించేది. మరోసమయంలో రానట్టుగా కనుపించేది. జూలియస్‌కు ఇది ఎండమావుల్లా కనుపించింది. అతని సంపదమాత్రం నానాటికీ పెరిగింది.

పిల్లలు పెద్దవాళ్ళైనారు. రెండోవాడు జల్సామనిషి. ఇష్టంవచ్చినట్టు ఖర్చుచేస్తాడు. జూలియస్‌కూ తండ్రికీ పోరాటం వచ్చినట్టే తనకూ తన కొడుకులకూ పోరాటం వచ్చింది.

ఈ లోగా ఒక కొత్త అధికారి నియమించబడ్డాడు. జూలియస్ ముఠా తగ్గిపోయింది. విషయాలన్నీ కేంద్రంలో నివేదించడానికి రోమ్ వెళ్ళాడు. కాని లాభంలేకపోయింది.

ఇంటికి తిరిగి రాగానే తన కొడుకు జల్సాల్లో మునిగి తేలుతున్నాడు. సైలీషియాలో జూలియస్ చనిపోయాడాని పుకారు పుట్టించారు. కొడుకు శ్రాద్ధం పెట్టడానికి సిద్ధంగా ఉన్నాడు. జూలియస్ కోపం పట్టలేక కొడుకునికొట్టి తన భార్యగదిలోకి వెళ్ళిపోయాడు. గదిలో అడుగుపెట్టగానే అతనికి బైబిల్ గ్రంథం కనుపించింది. అతనిలా చదివాడు. 'బరువులూ బాధలూ ఉన్నవారందరూ నాదగ్గరకురండి. విశ్రాంతి నిస్తాను?'

'ఈ పిలుపు ఎన్నాళ్ళనుంచో నాకు వినిపిస్తోంది. నేనే వినిపించుకోలేదు' అనుకున్నాడు జూలియస్.

చాలాసేపు అలాగే బైబిల్ మోకాళ్ళపై పెట్టుకుని ఆలోచిస్తూ కూచున్నాడు. తన పాతజీవితమంతా జ్ఞాపకం వచ్చింది. ఇలా ఆలోచించి ఆలోచించి చివరకు లేచి బైటికి వెళ్ళాడు. కొడుకు కనుపించాడు. అదృష్ట వశాత్తు అతనికి దెబ్బ తగల్లేదు.

కొడుకుతో ఒక్క మాటైనా చెప్పకుండా జూలియన్ బైటికి వెళ్ళాడు. క్రైస్తవుల ఆరామం వైపుకు నడుస్తూ వెళ్ళాడు. రోజంతా నడిచాడు. రాత్రి ఒక గ్రామంలో బస చేశాడు. తను బసచేసిన గదిలో ఒక వ్యక్తి కనుపించాడు. అతను ఆ వైద్యుడే.

'ఈసారి నీవు నన్ను మళ్ళించలేవు' అన్నాడు జూలియన్.

'ఎక్కడికి వెడుతున్నావు ?'

'క్రైస్తవుల ఆరామానికి'

'నీకు మనశ్శాంతి దొరకొచ్చు కాని, నీ బాధ్యత నీవు పూర్తిగా నెరవేర్చినట్టు కాదు. నిజమైన వేదాంతులు కష్టనష్టాలకు చలించరు. నీకు ఇప్పుడు అనుభవం పూర్తిగా పరిపక్వత చెందింది. నీ అనుభవాన్ని నీ జ్ఞానాన్ని ఇతరులకు పంచిపెట్టాల్సిన సమయం ఇది.'

'నాకు జ్ఞానమే లేదు. నేను పాప కూపంలో పూడుకు పోయిఉన్నాను' అని జూలియన్ మళ్ళీ యాత్ర సాగించాడు.

మరోరోజంతా నడిచాడు. ప్రొద్దుగూకేసరికి క్రైస్తవారామం చేరాడు.

అందరూ అతన్ని ఆనందంతో ఆహ్వానించారు. పామ్ఫ్లి యస్ కౌగిలించుకున్నాడు.

'చివరకు వచ్చాను. నేనేం చెయ్యాలో చెప్పు' అన్నాడు జూలియస్.

పామ్ఫ్లియస్ అతన్ని అతిథిగృహంలోకి తీసుకునివెళ్ళి విశ్రాంతి తీసుకోమన్నాడు.

మరుసటిరోజు ఉదయం జూలియస్ ద్రాక్షతోటల్లోకి వెళ్ళాడు. మొదటి తోటలో అప్పు డప్పుడే పండిన ద్రాక్ష గుత్తులు వ్రేలాడుతున్నాయ్. యువకులు వాటిని కోస్తున్నారు. జూలియస్‌కు ఆ తోటలో జాగా కనుపించలేదు. మరో తోట లోనికి వెళ్ళాడు. అక్కడ ద్రాక్ష గుత్తులు కొద్దిగా ఉన్నాయి. జూలియస్‌కు ఈ తోటలోకూడా జాగా కనుపించలేదు. మరో తోటలోకి వెళ్ళాడు. ఈ తోట నిర్మానుష్యంగా ఉంది. ఇక్కడ ద్రాక్షగుత్తులు ఎండి వాడిపోయి ఉన్నాయి.

'ఈ తోట నా జీవితంలా ఉంది' అనుకున్నాడు జూలి యస్.

'నేను మొదట వచ్చినట్లయితే మొదటి తోటలా ఉం డేది. రెండో పర్యాయం వచ్చినట్లవుతే రెండో తోటలా ఉం డేది. ఇప్పుడు ఈతోట నాజీవితంలాగానే శుష్కించి ఉంది' అనుకున్నాడు.

అతను ఆ తోటలో కూచుని తన బ్రతుకు ఇలా వృథా అయినందుకు వెక్కి వెక్కి ఏడ్చాడు. హఠాత్తుగా అతనికి ఒక ముసలివాని గొంతుక వినిపించింది. 'పనిచెయ్యి సోదరుడా'

అన్నది. జూలియస్ తోటంతా కలయచూచాడు. ఒక వృద్ధుడు తీయద్రాక్ష ఏరుతూ కనుపించాడు.

'శ్రమించు. శ్రమలో ఆనందం ఉన్నది.' అన్నాడు. ఆ వృద్ధుడు జూలియస్‌కు కొన్ని మిగిలిపోయిన ద్రాక్షగుత్తులు చూపాడు.

'ఈ ద్రాక్షగుత్తులు చూడు. ఇవి మాత్రం ఇతరతోట ల్లోని ద్రాక్షగుత్తులకు తీసిపోయాయా? పొద్దు కుంకకమునుపే నడవాలి. దీపం ఉన్నప్పుడే ఇల్లు చక్కబెట్టుకోవాలి' అన్నాడు జీసస్. జూలియస్! గతాన్ని గురించి విచారించకు. అందరం ఈశ్వరుని సేవకులమే. నీవు పశ్చాత్తపించావు. నీ పశ్చాత్తాపమే నీకు నూతన జన్మ నిచ్చింది.' అన్నాడు వృద్ధుడు.

జూలియస్ మనస్సు చల్లనైంది. అతని హృదయం శాంతిపూరితమైంది. ఆ రోజునుంచీ అతను ఆరామంలోనే ఉండిపోయాడు.

మరో ఇరవై ఏళ్ళు చల్లగా బ్రతికి చల్లగా దాటి పోయాడు.

# తార్తారులు తెచ్చిన ఖైదీ

జిలిన్ ఒక సైనికోద్యోగి. కాకసస్ ప్రాంతంలో పని చేస్తున్నాడు.

ఒకనాడు వాళ్ళ అమ్మదగ్గర్నించి ఉత్తరం వచ్చింది. "నాయనా! నేను ముసలిదాన్ని అయిపోయాను. చనిపోయే ముందు నిన్నొకసారి చూడాలని ఉంది. నీ చేతులమీదిగా దాటిపోతే నాకంతేచాలు. నన్ను మటిచేసి కావలిస్తే మళ్ళీ ఉద్యోగంలోకి వెడుదువుగాని. అదీగాక నీకొక సంబంధంచూచి ఉంచాను. పిల్ల బుద్ధిమంతురాలు, బాగుంటుంది. ఆ స్తితో కూడా వస్తుంది. నచ్చితే ఆ పిల్లను పెళ్ళాడి ఇంటిదగ్గరే ఉండి పోవచ్చు – ' అని రాసింది వాళ్ళ అమ్మ.

జిలిన్ బాగా ఆలోచించాడు. పండుముసిల్ది అమ్మ ఎప్పుడు రాలిపోతుందో చెప్పలేం. ఇప్పుడు వెళ్ళకపోతే బ్రతికుండగా చూస్తాడో చూడలేడో! కాబట్టి వెళ్ళటమే మంచిది. అదీగాక ఆ సంబంధం నచ్చితే పెళ్ళిచేసుకోనూవచ్చు.

జిలిన్ కల్నల్ దగ్గరకు వెళ్ళాడు. సెలవు మంజూరు చేయించుకున్నాడు. స్నేహితులందరికీ చెప్పాడు. ఒక చిన్న విందుకూడా చేశాడు. మూట ముల్లె సర్దుకున్నాడు.

అవి యుద్ధపురోజులు. రష్యన్ అనేవాడు బైటకనిపిస్తే తార్తారులు పొంచిఉండి చంపేస్తున్నారు. లేకపోతే కొండల్లోకి ఎత్తికెడుతున్నారు. సైనికసహాయం లేకుండా ఒక చోటినించి మరోచోటికి ప్రయాణంచెయ్యటం కష్టం. అక్కడక్కడ రష్యన్

పటాలాలు ఉండే కోటలున్నాయి. ప్రయాణీకులకు ఈ కోటల్లో రక్షణ ఇస్తారు. వారాని కొకసారి సైనికులే ఈ ప్రయాణీకులను వెంటబెట్టుకొని మరో కోటవరకూ తీసుకుపోతారు. అక్కడ వాళ్ళను సురక్షితంగా దించి తిరిగి వొచ్చేస్తారు. ఇలా ఒక ఏర్పాటు ఉంది.

అది వేసవికాలం. ఉదయాన్నే ఒక ప్రయాణీకుల జట్టు బయలుదేరింది. వీరి రక్షణార్థం కొందరు సైనికులుకూడా వెంట బయలుదేరారు. సామానుబండ్లు రోడ్డుపట్టాయి. జిలిన్ ఒక గుర్రంమీాద ఎక్కాడు. అతని సామాను ఒకబండిలో వస్తోంది. పదహారు మైళ్ళు వెళ్ళాలి. ప్రయాణం గబగబా సాగటంలేదు. మధ్యమధ్య సైనికులు విశ్రాంతికోసం ఆగుతారు. ఒక బండి చక్రం విరుగుతుంది. ఒక గుర్రం మొండికేస్తుంది. ప్రయాణం కుంటుపడుతుంది.

మధ్యాహ్నం అయింది. సగందూరం వెళ్ళారు. ఎండ మాడిపోతున్నది. రోడ్డంతా దుమ్ము, బెత్తెడు నీడలేదెక్కడా. చెట్టు, చేమ లేని మైదానం అంతా.

జిలిన్ గుర్రంమీాద కొంతదూరం ముందుపోయాడు. పోయి అక్కడ ఆగాడు — మిగతా వాళ్ళకోసం. అప్పుడతని కొక ఆలోచన తట్టింది : 'నేనొక్కడినీ గుర్రం మీాద ముందు పోతే యేం? నాది పసందైన గుర్రం. ఒక వేళ తార్తారులు మీాద కొస్తే మాత్రం వాళ్ళ కందకుండా బ్రరున స్వారి పోలేనూ? ఇంతలో మళ్ళీ అనుకున్నాడు; 'పోనీ, అందరితో కలిసి వెళ్ళటమే మంచిదేమో!'

ఇంతలో కోస్టిలిన్ వచ్చాడు గుర్రం మీాద. అతడు కూడా పటాలంలో ఒక ఉద్యోగి అతనివద్దతుపాకి కూడాఉంది.

పద జిలిన్! మనం ముందు పోదాంపద. ఎండచూచావా ఎంత ఘోరంగా ఉందో! నా చొక్కా అంతా చెమటకు తడిసి ముద్ద అయి పోయింది'- అన్నాడు కోస్టిలిన్.

కోస్టిలిన్ లావుగా ఉంటాడు. మంచి బలంగల మనిషి. ఎండకు ముఖమంతా కందిపోయింది. చెమట కారి పోతోంది. జిలిన్ కాస్త ఆలోచించాడు. 'నీతుపాకిలో తోటాలున్నాయా?' అని అడిగాడు.

ఓ, ఉన్నాయి.'

'అయితే పోదాం పద. కాని మనిద్దరం ఎడ మెడంగా ఉండకూడదు'

ఇద్దరూ బయలుదేరారు — కులాసాగా కబుర్లు చెప్పుకుంటూ. శత్రువు లెక్కడేనా పొంచి ఉన్నారేమో నని జాగ్రత్తగా ప్రక్కలకు చూచుకుంటూనే వెడుతున్నారు. మైదానం దాటారు. తరువాత రెండు కొండల మధ్య ఒక లోయలోనించి వెడుతున్నారు.

'మనం ఒకసారి ఈ కొండపై కెక్కి చుట్టూ చూడ్డం మంచి దనుకుంటాను. లేకపోతే తార్తారులు ఏ నిమిషాన అయినా వచ్చి మనమీాద పడచ్చు'—అన్నాడు జిలిన్.

'ఎందుకూ? అనవసరం. మామూలుగా సాగిపోదాం పద్దూ!' అన్నాడు కోస్టిలిన్.

కాని జిలిన్ ఒప్పుకోలేదు. 'పోనీ, నువ్వు ఇక్కడే ఉండు, నేనైనా వెళ్ళి చూచి వస్తాను'- అంటూ గుర్రాన్ని పక్కకు తిప్పి కొండమీాది కెక్కించాడు. ఉత్తమ జాతి గుర్రం అది. రెక్కలమీాద ఎదగిరిపోయే పిట్టలాగా గుర్రం పైకి సాగి

పోతోంది. ఈ గుర్రాన్ని పసితనంలో ఉన్నప్పుడు జిలిన్ నూరు రూబుల్సు పెట్టి కొన్నాడు. కొండ శిఖరందాగా వెళ్ళేసరికి... నూరు గజాల దూరంలో ముప్పయి మంది తార్తారులు పొంచి ఉండటం జిలిన్ చూచాడు. వాళ్ళుకనిపించగానే జిలిన్ గుర్రాన్ని వెనక్కు మళ్ళించాడు. గబగబా గ్యాలప్ తీయించాడు. 'కోస్టిలిన్! కోస్టిలిన్! తుపాకి తీయ్! తుపాకి తీయ్!' అని హెచ్చరిక చెబుతూ కిందికి వచ్చేస్తున్నాడు.

'నా బంగారు గుర్రమా? ముందుకు పడేవుసుమీ! పడ్డావంటే నాపని ఆఖరైపోతుంది. నన్ను సురక్షితంగా కిందికి తీసుకుపో. తుపాకి చేత జిక్కించుకున్నానంటే ఇక నన్ను వాళ్ళేం చెయ్యలేరు' అనుకున్నాడు మనసులో గుర్రాన్ని ఉద్దేశించి.

తార్తారులను చూడంతోనే కోస్టిలిన్ ఒక్కనిమిషంకూడా అక్కడ ఉండలేదు. గుర్రాన్ని వెనక్కు మళ్ళించేశాడు. గుర్రాన్ని అటూ ఇటూ కొరడా దెబ్బలు కొట్టుకుంటూ అతివేగంగా కోటకేసి గ్యాలప్ సాగించాడు. గుర్రం పరుగు తీస్తోంటే రోడ్డు మీాద దుమ్ము లేస్తోంది. ఆ దుమ్ములో పైకెగురుతోన్న గుర్రం తోక తప్ప మరేమీా కనిపించటంలేదు.

ఆ పారిపోయేవాడు తుపాకి అక్కడ పారేసిపోయినా బాగుండును. జిలిన్‌వద్ద ఒక కత్తి మాత్రమేఉంది. ఒక్కకత్తితో తానేమి చెయ్యగలడు? తానూ గుర్రాన్ని అదిలించి వెనక్కు గ్యాలప్ సాగించాడు. కానితార్తారులు అప్పుడే మీాది కొచ్చేస్తున్నారు. తన గుర్రంమంచిదే కానితార్తారుల గుర్రాలు ఇంకా మేలైనవి. కొందరుతార్తారులు అప్పుడే దారి కడ్డంగా వొచ్చే

శారు. జిలిన్ గుర్రాన్ని పక్కకు మళ్ళించి అడ్డదారిన పారిపోదా మనుకున్నాడు. కాని గుర్రం అతివేగంగా దూసుకుపోతోంది. ఆవేగాన్ని ఆపటం అతనికి సాధ్యంకాలేదు. దారికడ్డంగా వచ్చి ఉన్న తార్తారుల కేసే గుర్రం పరిగెడుతోంది. ఒక తార్తారు... ఎర్రం గెడ్డంవాడు, ..తుపాకిని జిలిన్ వైపు బారుపెట్టి అట్టహాసం చేస్తున్నాడు. ఒక గోధుమరంగు గుర్రంమీద కూచుని గర్జిస్తున్నాడు.

జిలిన్ ఏమిచేస్తాడు? తార్తారులంటే దయ్యాల్లాంటి వాళ్ళన్నమాట. వాళ్ళచేతుల్లో పట్టుపడ్డాడంటే కొరడాలతో చావగొడతారు. 'ప్రాణం ఉండగా వీళ్ళ చేతుల్లో చిక్క కూడదు' అనుకున్నాడు జిలిన్.

జిలిన్ దృఢకాయుడు కాదు. కాని మంచి ధైర్య సాహసాలు కల మనిషి. గుర్రాన్ని ఆ తార్తారు మీదుగా దూకించేయా లనుకున్నాడు. కత్తితీసి చేతిలో పట్టుకున్నాడు. వాడి మీదినుంచి దూసుకుపోతూ వాణ్ణి కత్తితో పొడిచెయ్యాలని కూడా అతని ఉద్దేశం. వేగంగా వొచ్చేస్తున్నాడు.

ఇంకా బారెడు దూరంలో ఉన్నాడు. ఎర్రగడ్డం తార్తారు ఇంతలో వెనుకనుంచి తుపాకి పేల్చాడు. గుండు వచ్చి జిలిన్ గుర్రానికి తగిలింది. గుర్రం నేలకు ఒరిగి పడ్డది. జిలిన్ కూడా కిందపడ్డాడు.

జిలిన్ లేవటానికి ప్రయత్నించాడు. కాని ఏం లాభం? క్రూరులు తార్తారులు లేవని స్తేగా! ఇద్దరొచ్చేసి అతని మీదెక్కి కూచున్నారు. చేతులు వెనక్కు విరిచి కట్టేస్తున్నారు. జిలిన్ బలంగా ఒక్కవిదిలింపు విదిలిం

చాడు. వాళ్ళిద్దర్నీ వొదిలించుకున్నాడు. కాని ఇంకా ముగ్గురు తార్తాకులు గుర్రాలు దిగి దగ్గరకు వచ్చారు. వాళ్ళు తుపాకుల్ని తిరగేసి జిలిన్‌ను తలమీద మొత్తారు. జిలిన్‌కు కళ్ళు తిరిగిపోయాయి. ఆగలేక పడిపోయాడు. తార్తారులు అతనిమీద వచ్చి పడ్డారు. చేతులు వెనక్కి విరిచి కట్టేశారు. టోపీ లాగిపారేశారు. బూట్లు పీకేశారు. జేబులన్నీ గాలించారు. దుస్తులు చింపేశారు. అతనిదగ్గర ఉన్న డబ్బు, ఒక జేబు గడియారం కాజేశారు.

జిలిన్ తన గుర్రంవైపు చూచాడు. పాపం, అది ప్రాణంపోక గిలగిల తన్నుకుంటోంది. తుపాకిదెబ్బ తలమీద తగిలిందేమో, అక్కడ గాయమై రక్తం కారి, రెండడుగులమేర నేల తడిసిపోయింది.

ఒక తార్తారు గబగబాపోయి దాని పీకదగ్గర కత్తితో కోసేశాడు. గొంతులోనుంచి ఈలవేసినట్టుగా ఒక శబ్దం వచ్చింది. గుర్రం ఒక్క పొర్లుపొర్లి చచ్చిఊరుకుంది.

తార్తారులు చచ్చిన గుర్రంమీదజీను, ఇంకా ఇతర సామానులు తీసుకున్నారు. ఎర్రగెడ్డం తార్తారు తన గుర్రం మీదెక్కి కూచున్నాడు. కొంతమంది జిలిన్‌ను ఎత్తి అతని వెనకాల జీనుమీద కూచోబెట్టారు. గుర్రం కుదుపుకు అతడు పడిపోకుండా ఒక పట్టాతో అతన్ని ఎర్రగెడ్డం తార్తారు నడుముకు కట్టేశారు. అందరూ ఆ తరువాత కొండల్లోకి దారితీశారు.

జిలిన్ గుర్రంమీద ఊగిసలాడుతూ ఉన్నాడు. మాటిమాటికీ అతని ముఖం తార్తారు వీపుకు కొట్టుకుంటోంది. తలకు బాగా గాయాలు తగిలాయి. నెత్తురు నుదిటి మీదినుంచి

కన్నులమీదికి కారి చారలు కట్టాయి. ముఖం తిప్పటానికీ వీల్లేదు. నెత్తురు తుడుచుకోటానికీ వీల్లేదు. చేతులు కట్టేశారు. మెడదగ్గర యెముకలు తీపు పెడుతున్నాయి. ముందు కూచున్న తార్తారు వీపు, మెడ తప్పితే అతనికేమీ కనిపించటంలేదు.

ఆ కొండల్లోగుండా చాలదూరం వెళ్ళారు. ఒక చిన్న నది దాటారు. ఆ తరువాత ఒకలోయలోనుంచి వెడుతున్నారు.

ఎటు పోతున్నదీ తెలుసు కుందా మనుకున్నాడు జిలిన్. కాని నెత్తురు కారి కంటిరెప్పలు అతుక్కుపోయాయి. మెడతిప్ప టానికి వీల్లేకుండా ఉంది.

సాయంత్రం కావచ్చింది. మరోనది దాటారు. ఒకకొండ పక్కగా కొంతదూరం పోయారు. ఆ ప్రదేశాన పొగ కనిపించింది. కుక్కలు మొరుగుతున్నాయి. అదొక చిన్న పల్లెటూరు. తార్తారులు గుర్రాలు దిగారు. తార్తారు పిల్లలు చాలమంది వచ్చి జిలిన్ చుట్టూ మూగారు. సంతోషంగా కేకలు వేశారు. జిలిన్ మీద రాళ్ళు రువ్వారు.

ఎర్ర గెడ్డం తార్తారు పిల్లల్ని దూరంగా వెళ్ళగొట్టేశాడు. జిలిన్‌ను గుర్రం మీదనుంచి దించాడు. ఒక నౌకర్ని కేక వేశాడు. వెడల్పాంటి దవడలు గల ఒక వ్యక్తి వచ్చాడు. వాడు చినిగిన చొక్కా ఒకటి వేసుకున్నాడు. చినుగుల్లోంచి గుండె అంతా కనిపిస్తూనేఉంది. యజమాని ఆజ్ఞాపించగా వాడు వెళ్ళి సంకెళ్ళు తెచ్చాడు. జిలిన్ చేతులకూ, కాళ్ళకు సంకెళ్ళు తగిలించి ఒక కొట్లోకి తోసి తాళం వేశారు.

వాళ్ళు తోసినప్పుడు జిలిన్ ఒక ఎరువు కుప్పమీద పడ్డాడు. లోపల అంతా చీకటిగా ఉంది. తడువు కుంటూ పోయి మెత్తగా వున్న ఒకచోట కూలబడ్డాడు.

## 2

ఆ రాత్రి జిలిన్‌కు నిద్రలేదు. రాత్రి పొద్దు తక్కువగా ఉండే రోజులు అవి. దబ్బునే తెల్లవారింది. గోడలో ఉన్న ఒక రంధ్రంలోనించి కాస్తంత సూర్యరశ్మి లోనికి వచ్చినది. ఆ రంధ్రాన్ని ఇంకా కొంచెం పెద్దదిగా చేసి జిలిన్ అందు లోనించి బైటికి చూచాడు.

కొండ మీదుగా కిందికి ఒక రోడ్డు కనిపించింది. కుడి వైపు తార్తారుల పాక ఒకటి ఉంది. పాక గుమ్మంలో ఒక నల్లటికుక్క పడుకుంది. ఒక మేక, దాని పిల్లలూ తోక లాడించు కుంటూ తిరుగుతున్నాయి. కాసేపటికి ఒక తార్తారు యువతి కనిపించింది. వొదులు వొదులుగా ఉన్న ఒక రంగు గౌను తొడుక్కుంది. ఎత్తుబూట్లు తొడుక్కుంది. నెత్తిమీద నీళ్ళ బిందె పెట్టుకుని మోసుకొస్తోంది. ఒక చిన్ని కుర్రాణ్ణి వెంట నడిపించుకు తీసుకొస్తోంది. కుర్రాడి వొంటిమీద ఒక చొక్కా తప్ప మరేమీ దుస్తులులేవు. బిందె మోసుకొస్తూంటే ఆమె మెడ నరాలు వొణుకుతున్నాయి. ఆమె నీళ్ళ బిందెతో పాక లోకి వెళ్ళింది. మరి కాసేపటికి నిన్నటి ఎర్ర గడ్డం తార్తారు బయటికి వచ్చాడు. సిల్కుదుస్తులు ధరించియున్నాడు. వెండి పొన్ను వేసిన కత్తి ఒకటి మొలకు వేలాడుతోంది. కాళ్ళకు

చెప్పులున్నాయి. గొర్రె బొచ్చుతో అల్లిన పొడుగాటి టోపీ పెట్టుకున్నాడు తలకు. పాకలోనించి బైటికి వచ్చి, కాసేపు గడ్డం తడువుకుంటూ నిలబడ్డాడు. ఆ తరువాత నౌకరుకు ఏమో పురమాయించి వెళ్ళి పోయాడు.

ఇంతలో చాలమంది పిల్లలు పోగైనారు. వీధిలో అంతా కలిసి కేరింతలతో కొట్టు దగ్గరకు వచ్చారు. వచ్చి గోడకున్న రంధ్రంలోనించి పుల్లలుపెట్టి పొడవటం ప్రారంభించారు. జిలిన్ గట్టిగా అరిచాడు. అప్పుడు వాళ్ళంతా కేకలు వేసుకుంటూ అక్కడినించి పారిపోయారు.

జిలిన్‌కు దాహం వేస్తోంది. గొంతెండి పోతోంది. ఎవరైనా తన్ను చూడ్డానికైనా వచ్చి తలుపు తీస్తారేమో నని ఆశతో ఉన్నాడు.

కొంతసేపటికి తాళం చప్పుడైంది. తలుపు తెరచుకుని ఎర్రగడ్డం తార్తారు లోపలికి వచ్చాడు. అతనితో మరో వ్యక్తి కూడా ఉన్నాడు. అతను పొట్టిగా నల్లగా ఉన్నాడు. ఎర్రటి బుగ్గలు, నల్లటి కళ్ళు, పిల్లిగడ్డం, నవ్వుమొగం, చలాకీ మని షిలా ఉన్నాడు. విలువైన దుస్తులే ధరించాడు. జరీఅంచుల సిల్కు దుస్తులు వేసుకున్నాడు. వెండిబాకు బొడ్లోఉంది. మందపాటి చెప్పులు తొడుక్కున్నాడు. ఊలు టోపీ పెట్టుకున్నాడు.

ఎర్రగడ్డం తార్తారు కోపంగా ఏమో గొణుక్కుంటూ లోపలికి వచ్చాడు. గండుతో డేల్లాగ జిలిన్ కేసి చూస్తూ, వయ్యారంగా తలుపుకానుకుని నిల్చున్నాడు. పొట్టిగా నల్లగా ఉన్న రెండో తార్తారు గబగబా జిలిన్‌వద్దకు వచ్చాడు. అతన్ని

పరకాయించి చూచాడు. చివరకు ఠీవిగా నిల్చుని అతని బుజం తట్టి గబగబా తన భాషలో ఏదో మాటాడాడు...మధ్యమధ్య పళ్ళికిలిస్తూ, కళ్ళు ఎగరేస్తూ.

వాడిమాట ఒక్కటికూడా జిలిన్‌కు అర్థంకాలేదు. 'దాహం వేస్తోంది. కాసిని మంచినీళ్ళు ఇప్పించండి' అన్నాడు.

పొట్టితార్తారు నవ్వాడు. 'రష్యావాడు! భలే! భలే!' అంటూ మళ్ళీ తన భాషలో ఏమో వాగటం మొదలెట్టాడు.

జిలిన్ పెదవులు కదిలించి, చేతులతో సైగచేస్తూ తనకు దాహం కావాలని సూచించాడు.

పొట్టితార్తారు ఇప్పుడు అర్థంచేసుకున్నాడు. మళ్ళీ నవ్వాడు. ద్వారంలోంచి బైటికిచూస్తూ 'దీనా!' అనిపిల్చాడు.

ఒక అమ్మాయి పరిగెత్తుకుని వచ్చింది. ఆమెకు పదమూ డేళ్ళు వుంటాయి. బక్కపలచగా వుంది. ఆ పొట్టితార్తారుకు కూతురై వుంటుంది. ఇద్దరికీ చాల దగ్గరపోలికలే వున్నాయి. అతనికిలాగే ఆపిల్ల కళ్ళూ నల్లగా వున్నాయి; ముఖం చలాకీగావుంది. తొగరుఅంచు నీలిరంగు గౌను తొడుక్కుంది. లాగు వుంది. కాళ్ళకు స్లిప్పర్లు వున్నాయి. మెడలో వెండిగొలుసు వుంది. నల్లటిజుట్టు. చక్కగా జడ అల్లుకుని రిబ్బనుతో ముడి వేసుకుంది చివర.

తండ్రి ఆజ్ఞప్రకారం ఆమె వెళ్ళి మంచినీళ్ళచెంబు తీసు కొచ్చింది. చెంబు జిలిన్‌కు అందించి నేలమీద కూచుంది. జిలిన్ మంచినీళ్ళు తాగుతున్నాడు. ఆ పిల్ల అతనికేసే చూస్తోంది...ఒక అడవి జంతువును చూచినట్టు.

జిలిన్ దాహం తీర్చుకొని ఖాళీచెంబు మళ్ళీ ఆ పిల్ల కివ్వబోయాడు. ఆమె దాన్ని అందుకుని భయపడ్డట్టు వెనక్కు గంతేసింది. వాళ్ళ నాన్న పకపక నవ్వాడు. తండ్రిఆజ్ఞ ననుసరించి ఆపిల్ల మళ్ళీవెళ్ళి ఒక రొట్టె తీసుకొచ్చింది. జిలిన్ ఆ రొట్టె తింటోంటే ఆ పిల్ల చిత్రంగా చూస్తూ కూచుంది.

చివరకు టిక్కీ తలుపులు తాళం వేసి తార్తారులు వెళ్ళిపోయారు.

మరికొంత సేపటికి తార్తార నౌకరు ఒకడు వచ్చి వాళ్ళ భాషలో ఏదో గొణిగాడు. జిలిన్‌కు ఆ మాటలు అర్థం కాలేదు. కాని తన్ను వాడెక్కడికో తీసుకుపోయేందుకు వచ్చి నట్లు తెలుసుకున్నాడు. అతని వెనకాల బయలుదేరాడు. కాళ్ళకు తగిలించిన బండకొయ్య మూలాన కుంటుకుంటూ కష్టంగా నడిచి వెళ్ళాడు.

తార్తార పల్లె అంతపెద్దదికాదు. పది యిళ్ళేఉన్నాయి. ఒక మసీదు కూడా ఉంది. ఒక యింటిముందు మూడు గుర్రాలు, జీను అవీ వేసి సిద్ధంగా ఉన్నాయి. కళ్ళేలు పట్టుకుని పిల్లలు గుర్రాలముందు నిల్చున్నారు. ఆ ఇంట్లోనుంచి ఆ పొట్టి తార్తారు బైటికి వచ్చాడు. జలిన్ కనుపించగానే లోనికి రమ్మన్నట్లు చెయి ఊపాడు. ఆ తరువాత నవ్వుకుంటూ తన భాషలో ఏదో వాగుతూ లోనికి వెళ్ళిపోయాడు.

జిలిన్ లోపలికి వెళ్ళాడు. ఆ గది చాలా అందంగానే ఉంది. ఒకమూల రంగురంగుల దుప్పట్లలో చుట్టిన పరుపులు చుట్టిపెట్టారు. ఒక గోడకు తుపాకులు, పిస్తోళ్ళు, కత్తులు, కటార్లు వేలాడుతున్నాయి. గోడలన్నీ మట్టితో అలికి నున్నగా

ఉన్నాయి. నేలకూడ చాల పరిశుభ్రంగా ఉంది. ఒకమూల పెద్ద తివాచీ పరిచారు. దానిమీద అయిదుగురు తార్తారులు గోడలకు వేసిన దిండ్లు ఆనుకుని మొత్తలమీద కూచున్నారు. వారిలో ఎర్రగడ్డం తార్తారు, పొట్టితార్తారు ఉన్నారు. మిగతా ముగ్గురు కొత్తవాళ్ళు. వారిముందు ఒక గుండ్రనిబల్ల ఉంది. దానిమీద జొన్నరొట్టె లున్నాయి. ఒక పెద్దగిన్నెలో సారాయం వుంది. అందరూ విందు ఆరగిస్తున్నారు.

పొట్టితార్తారు ఆజ్ఞ పురస్కరించుకుని తార్తార్ల నౌకరు జిలిన్‌ను తివాచీమీద కాకండా నేలమీద కూచోబెట్టాడు. పొట్టితార్తారు అందరికీ రొట్టెలూ, సారాయం అందిస్తున్నాడు. నౌకరు నోరూరుతూవుంటే పెదవులు చప్పరించుకుంటూ అక్కడే నిల్చుని చూస్తున్నాడు.

తార్తారులు దిట్టంగా విందు ఆరగించారు. ఒక స్త్రీ ఒక డేకిసా పట్టుకొచ్చింది. అందరూ అందులో చేతులు కడుక్కన్నారు. తరువాత అందరూ మోకరిల్లి నమాజు చేశారు. నమాజు అనంతరం.....విందుకొచ్చిన కొత్త వారిలో ఒకాయన జిలిన్ వైపు తిరిగి రష్యన్‌భాషలో ఒక చిన్న వుపన్యాసం చెప్పాడు.

'అబ్బాయీ! నువు కాజీ మహమ్మద్‌గారిచే పట్టుపడ్డావు. కాజీ మహమ్మద్‌గారు నిన్ను అబ్దుల్ మురాద్‌గారికి వొప్పజెప్పేశారు. ఇప్పుడు అబ్దుల్ మురాద్‌గారు నీ యజమాని.

కాజీ మహమ్మద్ అంటే ఎర్రగడ్డం తార్తారు.
అబ్దుల్ మురాద్ అంటే పొట్టి తార్తార్ అని జిలిన్‌కు
మర్యాదలాగు చూపించి చెప్పాడు ఆ పెద్దమనిషి.

జిలిన్ ఏమీ మాటాడలేదు. అబ్దుల్ మురా
నవ్వుతూ ఏదో తన భాషలో వాగాడు. రష్యన్ భాష వఁ
నాయన దాన్ని తర్జుమాచేసి జిలిన్‌కు తెలియ జెప్పాఁ
'అబ్బాయీ ! నువు ఇంటికి ఉత్తరం రాసి డబ్బు తెప్పించుకో
ఆడబ్బు మురాద్‌గారికి ఇచ్చేస్తే నిన్ను విడిచి పెట్టేస్తారు.'

జిలిన్ కాసేపు ఆలోచించి అడిగాడు: 'ఎంతడబ్బు
ఇవ్వాలిట?'

తార్తారులు కాసేపు సంప్రదించుకున్నారు. చివరకు
రష్యన్‌భాష వచ్చినాయన చెప్పాడు. 'మూడువేల రూబుల్స్.'

'నేనంత యిచ్చుకోలేను'

అబ్దుల్ మురాద్ కోపంగా లేచి, చేతులుతిప్పుకుంటూ
మళ్ళీ తనభాషలో గడగడ వాగాడు. ద్విభాషి మళ్ళీ అను
వాదం చేశాడు : 'ఎంతైతే ఇచ్చుకోగలవు?'

'అయిదువందల రూబుల్సు' కాస్త ఆలోచించుకుని
చెప్పాడు జిలిన్.

తార్తారులంతా తమలోతాము మళ్ళీ సంప్రదింపులారం
భించారు. అబ్దుల్ మురాద్ ఎర్రగడ్డం తార్తారుతో, నోటి
వెంట తుప్పర్లు పడుతోంటే, గడగడ ఏమిటో వాగాడు. ఎర్ర
గడ్డం తార్తారు బుగ్గల్లో నాలిక జొనుపుకుంటూ గుడ్లు వొప్ప
జెప్పి చూస్తున్నాడు.

తార్తారులు తమలో తాము కొంతసేపు గొడవపడ్డాక
ద్విభాషి జిలిన్‌ను ఉద్దేశించి ఇలా అన్నాడు. 'అయిదువందల

రూబుల్సు చాలవు. కాజీమహమ్మదు అబ్దుల్ మురాదుకు బాకీ ఉన్నాడు, ఆ బాకీ పోను ఇంకా రెండువందలు రూబుల్సు పైగా ఇచ్చి నిన్ను తీసుకున్నాడు అబ్దుల్ మురాదు. నువ్వు మూడువేలు తెప్పించి ఇవ్వాల్సిందే. తక్కువైతే ఒప్పుకునేది లేదు. నువ్వు డబ్బుకోసం ఉత్తరం రాయకపోతే చావగొట్టేస్తారు.'

వీళ్ళకు భయపడితే లాభంలేదు. అనుకున్నాడు జిలిన్. 'నువ్వు ఆ కుక్కవెధవతో చెప్పు : నను బెదిరించి లాభంలేదు. నేను అసలే రాయను ఇంటికి ఉత్తరం. వాడికి దమ్మిడీకూడా రాదు. మీలాంటి కుక్కవెధవలకు నేను భయపడేది లేదు.'

మళ్ళీ తార్తారులు తమలోతాము సంప్రదింపులకు దిగారు. గల గల వాగారు కాసేపు. పొట్టితార్తారు జిలిన్ దగ్గరకువచ్చి వాళ్ళభాషలో 'మంచిదిట్టమైన వాడివేలే' అని పలికి ద్విభాషితో ఏమో చెప్పాడు. ద్విభాషి జిలిన్ వైపు తిరిగి 'ఏం అబ్బాయీ? వెయ్యి రూబుల్సు చాలు సంటున్నారు, ఏమంటావ్' అని అడిగాడు.

'నేను అయిదువందలే ఇస్తాను. నన్ను చంపినా సరే, ఒక్క దమ్మిడీకూడా ఎక్కువ ఇయ్యను.'

తార్తారులు తమలో తాము మళ్ళీ కాసేపు మాటాడుకున్నారు. నౌకరును ఏదో ఆజ్ఞాపించి పంపించారు. జిలిన్ వైపూ, ద్వారంవైపూ చూస్తూ కూచున్నారు. నౌకరు తిరిగి వచ్చాడు. అతనివెంట ఒక లావుపాటి వ్యక్తి ఒకడు ఉన్నాడు. అతని కాలికి బండకొయ్య ఉంది. జిలిన్ ఆశ్చర్యపోయాడు. ఆ వ్యక్తి కోస్టిలిన్.

జిలిన్, కోస్టిలిన్...ఇద్దరూ తమ తమ గాధలన్నీ ఒకరికొకరు చెప్పుకున్నారు. కోస్టిలిన్ గ్రుర్రం కొంత దూరం

వరిగె త్తి హఠాత్తుగా ఆగిపోయింది. తుపాకిలో తోటాలుకూడా తొందరలోనేఅయిపోయాయి. ఇంకే ముంది? అబ్దుల్ మురాద్ చేతిలోచిక్కాడు.

అబ్దుల్ మురాద్ లేచి కోస్టిలిన్‌కేసి చూపిస్తూ ఏమో చెప్పాడు. ద్విభాషి అనువదించాడు. ఇప్పుడా యిద్దరికీ మురాదే యజమాని అనీ, ఎవరు ముందు డబ్బు తెప్పించి యిస్తే అతన్ని వొదిలేస్తా మనిన్నీ, ద్విభాషి జిలిన్ వైపు చూస్తూ ఇంకా ఇలా చెప్పాడు. 'నువ్వు ఊరికే రుసరుసలాడుతున్నావు కాని నీ మిత్రుడు చూడు, చాల నెమ్మదైన మనిషి. ఇంటికి ఉత్తరం రాశాడు. అయిదువేల రూబుల్సు వస్తాయి. అతనికి మంచిఆహారంపెడతాం, మర్యాదగాచూస్తాం.'

'నా స్నేహితుడు తన యిష్టం వచ్చినట్టు చేసుకుంటాడు; నాకేం? అతడు ఆస్తిమంతుడైతే కావచ్చు. నేను మాత్రం కాదు. నేను ఇస్తానన్న దేమో ఇస్తాను. అంతకు మించి దమ్మిడీకూడా ఇవ్వను. నన్ను చంపేస్తే చంపెయండి. మీకేం లాభం?'

కాసేపు అంతా నిశ్శబ్దంగా ఉన్నారు. అబ్దుల్ మురాద్ లేచి ఒక చిన్న పెట్టె తెచ్చాడు. అందులోనించి ఒక కాగితం, కలం తీసి జిలిన్‌కు ఇచ్చాడు. అతని భుజంమీద తట్టుతూ ఉత్తరం వ్రాయమంటూ సైగచేశాడు. అయిదు వేలరూబుల్సే తీసుకోటానికి వప్పుకున్నాడన్న మాట!

'ఉండండి' అంటూ జిలిన్ ద్విభాషి వైపు తిరిగి 'ఇదిగో, మీ రతనితో చెప్పండి: మాకు మంచి ఆహారం ఇవ్వాలి; మంచి దుస్తులు, బూట్లు ఇవ్వాలి. మమ్మల్ని ఇద్దర్నీ

ఒక చోటే ఉండనీయాలి. ఈ బండకొయ్యలు తీసేయాలి.'
అంటూ మురాద్ వైపు చూచి నవ్వాడు.

మురాద్ కూడా నవ్వాడు; ద్విభాషి అనువాదం చెప్పాడు. 'ఓ, మంచి దుస్తులే ఇస్తాం, పెళ్ళికొడుకు ధరించే బట్టలు ఇస్తాం. రాజకుమారులు తినే ఆహారం పెడతాం. కావలిస్తే ఇద్దరూ కలసి ఆ టిక్కీలోనే ఉండవచ్చు. బండ కొయ్యలు మాత్రం తీసెయ్యటానికి వీల్లేదు. తీసేస్తే పారిపోరూ! రాత్రిళ్ళు మాత్రం తీసేస్తాం' – అంటూ జిలిన్ భుజంమీద తట్టుతూ 'భేష్ మంచి దిట్టమైన వాడివిలే' అన్నాడు.

జిలిన్ ఉత్తరం రాశాడు. కాని చిరునామా మాత్రం సరిగా రాయలేదు. అది చేరవలసినచోటికి చేరకూడదని అతని అభిప్రాయం. డబ్బు ఇవ్వకుండానే తప్పించుకు పారిపోవాలని అతని ఊహ.

జిలిన్‌ను, కోస్టిలిన్‌ను టిక్కీలోకి తీసుకుపోయి విడిచి పెట్టారు. ఇంత జొన్నచొప్ప పడేశారు, పక్కలుగా ఉపయోగించుకునేందుకు. తినటానికి రొట్టెలు పంపించారు. రెండు పాత చొక్కాలు, రెండు జతలు మిలటరీబూట్లు పంపించారు. రాత్రి మాత్రం బండకొయ్యలు తీసేశారు, టిక్కీ తలుపులు తాళంవేసి వెళ్ళిపోయారు.'

## 3

ఒక నెల గడచిపోయింది. అప్పుడప్పుడు అబ్దుల్ మురాద్ వచ్చి చూచిపోతూ ఉండేవాడు. వచ్చినప్పుడెల్లా జిలిన్‌ను భుజంమీద తట్టి 'భేష్, మంచి దిట్టమైన వాడివిలే' అని

నవ్వుతూ ఉండేవాడు. కాని మంచి ఆహారం ఇవ్వటంలేదు. కాలీకాలని జొన్నరొట్టెలు పడేస్తూ ఉండేవాడు.

కోస్టిలిన్ మరోసారికూడా ఇంటికి ఉత్తరం రాశాడు. ఇంటినించి డబ్బు ఎప్పుడొస్తుందా అని రోజులు లెక్కబెట్టు కుంటూ కూచుండేవాడు; లేకపోతే జొన్నచొప్పమీదపడి కునికిపాట్లుతీస్తూ ఉండేవాడు.

జిలిన్ మళ్ళీ ఉత్తరం రాయలేదు. మొదటి ఉత్తరమైనా తన తల్లికి చేరదని అతనికి తెలును. ఒకవేళ చేరినా ఆమె అయిదువందల రూబుల్సు ఎక్కడినించి తెస్తుంది? ఇన్నాళ్ళ నించి తన జీతంలోంచి కొంత డబ్బు తాను పంపిస్తోంటే కాల క్షేపం చేస్తోంది. ఎలాగైనా ఇక్కడినించి తప్పించుకుని పారిపో వాల్సిందే అని జిలిన్ నిర్ణయం. కాని ఎలా పారిపోవాలి? అని ఆలోచిస్తూ వుండేవాడు.

అప్పుడప్పుడు ఈలవేసుకుంటూ ఆ టిక్కీలో ఆ పక్క నించి ఈ పక్కకు పచార్లుచేస్తూ వుంటాడు. లేకపోతే మట్టి బొమ్మలు చేస్తూ వుంటాడు. చిన్నచిన్న బుట్టలు అల్లుతూ వుంటాడు. అతనికి చేతిపనులు బాగా వచ్చు. ఒకసారి అతడొక బొమ్మను తయారుచేశాడు. ముక్కు, ముఖం, కళ్ళు, చేతులు, కాళ్ళు తీర్చిదిద్దాడు. తార్తార్ ఫేషన్‌లో వుండేట్టు ఒక గౌను తొడిగాడు. ఆ బొమ్మను టిక్కీ కప్పుమీద పెట్టాడు. తార్తారు యువతులు నీళ్ళకు వెడుతున్నారు. దీనాకూడా వాళ్ళతో వెడుతోంది దీనా వాళ్ళందరికీ ఆ బొమ్మను చూపించింది. బిందెలు నేల మీద దించుకుని తార్తారు యువతులు ఆ బొమ్మకేసి చూస్తూ ఏమిటో వింతగా చెప్పుకుని నవ్వుకుంటున్నారు. జిలిన్‌బొమ్మను

కప్పుమీదనించి తీసి వాళ్ళకు ఇవ్వబోయాడు. వాళ్ళనవ్వుతూ నిల్చున్నారు. ఎవరూ వచ్చి తీసుకోలేదు. జిలిన్ బొమ్మను టిక్కీ గుమ్మం దగ్గర పెట్టేసి లోపలికి వెళ్ళిపోయాడు, ఏం జరుగుతుందో చూదామని.

దీనా పరిగెత్తుకు వచ్చింది. చుట్టూ చూచింది. బొమ్మను తీసుకుని వెళ్ళిపోయింది.

మర్నాటి ఉదయం వాళ్ళింటి గుమ్మంముందుకూచుంది. ఆమె చేతిలో ఆ బొమ్మ ఉంది. దానికి చిన్న చిన్న రంగు రంగుల గుడ్డ పేలికలు అతికించింది. పసిపిల్లనులాగ చేతిలో పెట్టుకుని ఊపుతూ జోలపాట పాడుతోంది. ఇంతలో ఒక ముసలమ్మ వచ్చి కేకలేసింది. బొమ్మ లాక్కుని నేలకు విసిరి కొట్టింది. అది ముక్కలు ముక్కలైపోయింది.

జిలిన్ ఇంకో బొమ్మను...ఇదివరకు దానికంటే అందంగా తయారుచేశాడు. దీనాను పిల్చి దాన్ని ఆమె కిచ్చేశాడు.

ఒకనాడు దీనా ఒక చిన్న కూజా తెచ్చింది. దాన్ని టిక్కీగుమ్మం దగ్గర పెట్టి, జిలిన్ కేసి చూస్తూ, ఆ కూజా కేసి చూపిస్తూ నవ్వింది. జిలిన్ కేమీ అర్థంకాలేదు. మొదట వచ్చి కూజా అందుకున్నాడు. అందులో మంచి నీళ్ళు తెచ్చింది కామాలనుకున్నాడు. కాని అందులో పాలు ఉన్నాయి. కూజా యెత్తి గట గట తాగేశాడు. 'చాల బాగున్నాయి పాలు' అన్నాడు.

దీనా చాల సంతోషించింది. చప్పట్లు చరుస్తూ గంతు లేసింది. ఆ తరువాత కూజా తీసుకుని పరుగెత్తుకుపోయింది. నాటినించి దీనా దొంగతనంగా ఇంట్లోనించి పాలు తెచ్చి జిలిన్‌కు ఇచ్చేది.

తాతారులు మేక పాలలోంచి మీగడ తీసి ఎండ బెడతారు. అప్పుడప్పుడు దాన్ని అల్పాహారంగా తింటారు. అడపా తడపా ఈ మీగడకూడా తెచ్చి దీనా జిలిన్‌కు ఇస్తూ ఉండేది. ఒకసారి వాళ్ళింట్లో మేకమాంసం వండారు. దీనా దాన్నికూడా కాస్త జిలిన్‌కు ఇచ్చింది. జిలిన్ దగ్గరకు రాదు. తెచ్చిన వస్తువుల్ని దూరంగా పెట్టి పరుగెత్తిపోతుంది.

ఒకరోజున పెద్ద తుపాను వీచింది. ఒక గంటసేపు కుంభ పోతగా వర్షం కురిసింది. ఎక్కడ చూచినా వర్షపు నీరు కాలువలు కట్టాయి. వాగులు, వంకలు, వరదలు కట్టాయి; కొండల మీద సెలయేళ్ళు గలగల ఒకటే చప్పుడు. చివరకు వర్షం వెలిసింది. వీధులనిండా నీళ్ళు ప్రవహిస్తున్నాయి. జిలిన్ తన యజమాని దగ్గరనించి ఒక చాకు సంపాదించాడు. దానిదో ఒక కొయ్యముక్కను స్థూపాకారంగా చెక్కాడు. ఇంకా కొన్ని చెక్కలుకోసి ఒక చక్రం తయారుచేశాడు. దానికి ఇరుప్రక్కలా రెండు బొమ్మలు తగిలించాడు. తాతారు బాలికలు ఏవో గుడ్డ పీలికలు తెచ్చారు. వాటిని ఆ బొమ్మలకు దుస్తుల్లా అతికించాడు. ఒకటిమగబొమ్మ, రెండోది ఆడబొమ్మ. ఇద్దరూ రైతు దంపతుల్లా ఉన్నారు. చక్రానికి ఆ బొమ్మల్ని తగిలించాడు. చక్రం బరువైన తిరుగుతూంటే రైతు దంపతులు నాట్యం చేశారు.

ఊరంతా వచ్చింది ఈవింత చూడ్డానికి. బాల బాలికలు స్త్రీ పురుషులు అంతా చూచి ఆనందించారు. జిలిన్‌ను చాల మెచ్చుకున్నారు.

అబ్దుల్ మురాద్ దగ్గర ఒకగడియారం వుంది. అదిఆమధ్య పగిలిపోయింది. అతడుదాన్ని తీసుకొచ్చి జిలిన్‌కుచూపించాడు.

'దీన్ని నేను బాగుచేసి ఇస్తాను' అన్నాడు జిలిన్. చాకు సహాయంతో దానిలోని అన్ని పనిముట్లూ విడివిడిగా బైటికి తీసి మళ్ళీ యథాస్థానాల్లో అమర్చాడు. గడియారం చక్కగా ఆడుతోంది.

మురాద్‌కు ముచ్చటైంది. బాగా చినిగిపోయిన తన చొక్కా ఒకటి అతనికి బహుమతి ఇచ్చాడు. దాన్ని జిలిన్ స్వీకరించక తప్పలేదు. కనీసం రాత్రిళ్ళు కప్పుకోటానికైనా వుపయోగిస్తుందిలే అనుకున్నాడు.

జిలిన్ కీర్తి చుట్టుపక్కల గ్రామాలకు కూడా వ్యాపించింది. దూరపు పల్లెలనుంచీ కూడా తార్తారులు వచ్చి తుపాకి పిస్తోలు, గడియారం ... ఏవేవో అతని చేత బాగు చేయించుకొనిపోతూ వున్నారు. మురాదు అతనికి ఆకురాయి, పట్కారు మొదలైన పనిముట్లుకూడా సప్లయి చేశాడు.

ఒకనాడొక తార్తారుకు జ్వరం వచ్చింది. కొందరు జిలిన్ దగ్గరకు వచ్చి 'నువ్వు అతనికి మందిచ్చి నయంచెయ్యాలి.' అన్నారు. జిలిన్‌కు వైద్యం తెలియదు. అయినా వెళ్ళి రోగిని చూచాడు. వీడికి మందిచ్చినా ఇవ్వకపోయినా నయం కాకపోతుందా? అనుకున్నాడు. మళ్ళీ తన టిక్కీలోకి వచ్చాడు. కాసిని నీళ్ళలో ఇంత ఇసుక కలిపాడు. తార్తారులు చూస్తూ వుండగా ఏదో మంత్రం గొణిగాడు. 'దీన్ని రోగిచేత తాగించండి.' అని ఇచ్చాడు. అదృష్టవశాత్తు రోగికి జ్వరం తగ్గిపోయింది.

క్రమేణా జిలిన్ తార్తార్ల భాష కొద్దిగానేర్చుకున్నాడు. కొంతమంది తార్తార్లు కూడా స్నేహితులైనారు. ఇవాన్ ! అని

పిల్చేవాళ్ళు అతన్ని. మంచిపరిచయంగా వుండేవాళ్ళు. కొందరు మాత్రం అతన్ని అడవి మృగంలాగే భావించి, దగ్గరకుకూడా వచ్చేవాళ్ళుకాదు.

ఎర్ర గడ్డం తార్తారుకు మాత్రం జిలిన్ని చూస్తే కడుపు మంటగా వుండేది. కనుపించినప్పుడెల్లా పళ్ళు కొరికేవాడు. గుడ్లురిమి చూచేవాడు. ముసలి తార్తారు ఒకడు వున్నాడు. అతడు ఆ పల్లెలో నివసిస్తున్నవాడుకాదు. ఓ కొండ పక్క నించి వస్తాడు. జిలిన్ అతన్ని రోజూ మసీదుకు వెడుతూంటే చూస్తాడు. పొట్టిగా వుంటాడు. టోపీ చుట్టూ తెల్లటి గుడ్డ చుట్టుకుంటాడు. గడ్డం మీది వెంట్రుకలు,మీసాలు అంటక త్తిరించి వేస్తాడు. గడ్డం, మీసాలుకూడా బాగా నెరసిపోయాయి. నుదుటిమీది చర్మం ముడుతలు పడింది. ఇటికరంగు ముఖం — గద్దకులాగ వొంపు తిరిగిన ముక్కు, బూడిదరంగు కళ్ళు, వాటి నిండా క్రౌర్యమే. కోరల్లాగ ముందు రెండు పళ్ళు తప్ప మిగతావన్నీ ఊడిపోయాయి. కర్ర ఒకటి పుచ్చుకునే తోడేల్లా చూచుకుంటూ మసీదుకు వెడుతూ వుంటాడు. జిలిన్ కనిపిస్తే చాలు; ఈ ముసలివాడు కోపంతో గిర్రున ముఖం తిప్పుకుని ఏమేమో గొణుక్కుంటాడు.

ఒకనాడు జిలిన్ కొండ దిగి వెళ్ళాడు...ఈ ముసలి వాడు ఎక్కడ కాపురం వుంటున్నాడో చూద్దామని. కొండ కింద ఒక చిన్నతోటకనిపించింది. తోటలో పళ్ళచెట్లు వున్నాయి. కొన్నిచోట్ల తేనె తెట్టెలు కనిపించాయి. తేనె టీగలు బంయ్ మంటూ తిరుగుతున్నాయి. తోట చుట్టూ ఒక రాతిగోడవుంది. తోటలో మధ్యగా ఒకపాకవుంది. ముసలివాడు పాకబైట

లో వున్నాడు. గోడ అవతలనుంచి నిక్కి చూచాడు

అతని కాలి బండకొయ్యకున్న గొలుసులు చప్పుడై

నే ఆ ముసలివాడు పక్కకు తిరిగి పిస్టల్ తీసి పేల్చాడు.

గోడచాటుకు తప్పుకున్నాడు.

ముసలయ్య వెళ్ళి మురాద్‌కు ఫిర్యాదు చేశాడు.

ద్ జిలిన్ను పిలిపించాడు. 'నువు ఆయనింటికి ఎందు

వు?' నవ్వుతూ అడిగాడు.

'నేనేమీ దురుద్దేశంతో వెళ్ళలేదు. ఆయనగారు

స్థ్యం ఎలా గడుపుచున్నారో చూద్దామని వెళ్ళాను'

మురాద్ ఆ మాటే ముసలివానికి చెప్పాడు. ముసల

ఎక్కడలేని కోపం వచ్చేసింది. కోరలు బైటపెట్టి గల

గుతూ, పిడికిళ్ళు పట్టి హంగామా చేశాడు.

జిలిన్‌కు ఆ మాటలేమీ అర్థం కాలేదు. 'రష్యావాళ్ళను

అట్టిపెట్టుకుంటావా? చంపి పారెయ్యాలిగాని' అని

లివాడు మురాద్‌కు చెబుతున్నట్టుగా ఊహించాడు.

ముసలయ్య వెళ్ళిపోయాక 'ఏరెవరు?' అని అడిగాడు

ఆయన చాల గొప్పవాడులే. మా అందరిలోనూ

ధైర్య సాహసాలుకలవాడు. ఒకప్పుడు, ఆయనకు

భార్యలు, ఎనిమిదిమంది కొడుకులూ వుండేవాళ్ళు.

ఒక పల్లెటూళ్ళో కాపురం ఉండేవాళ్ళు. ఒకసారి

వచ్చి ఆ గ్రామాన్ని నాశనం చేశారు. ఏడుగురు

చంపేశారు. ఎనిమిదోవాడు ఒకడుమాత్రం

వాడు బుద్ధిపూర్వకంగా రష్యన్‌లకు లొంగి

పోయాడు. ఈ ముసలయ్యకూడా లొంగిపోయాడు. ఇళ్ళి రష్యన్లతో కలసి మూడు నెలలు ఉన్నాడు. ఆ తరువాత కొడుకును వెతకి ఎక్కడున్నాడో తెలుసుకున్నాడు. వాడిని చేతులార చంపేసి పారిపోయి వచ్చాడు. అక్కడినించీ యుద్ధం చెయ్యటం మానేశాడు. మా పుణ్య క్షేత్రమైన మక్కాకు వెళ్ళి వచ్చాడు. అందుచేతే తలగుడ్డ చుడతాడు టోపీమీద. మక్కాకు వెళ్ళి వచ్చినవాడిని మేము 'హాజీ' అంటాము. హాజీ అయితే తలపాగ ఉండాల్సిందే. అతనికి మీారంటే గిట్టదులే. నిన్ను చంపేయమని చెబుతున్నాడు. కాని ఎలా చంపను? నిన్ను డబ్బుపెట్టి కొన్నాను. పైగా ఇన్నాళ్ళనించీ నువ్వంటే నాకు ఇష్టం ఏర్పడింది. నిన్ను నేను చంపలేను సరికదా; నిన్ను విడిచిపెట్టి వుండ లేమోననికూడా అనిపిస్తోంది. నువు చాల మంచివాడివి.'

# 4

ఒక నెల గడిచింది. జిలిన్ పగలంతా టిక్కీలో పచార్లు చేస్తూనో, లేకపోతే ఏవైనా వింత వస్తువులు తయారుచేస్తూనో కాలక్షేపం చేస్తాడు. రాత్రిళ్ళుమాత్రం ఓపిగ్గా కూచుని ఒక మూల గోడపక్కన గొయ్యి తవ్వుతాడు. గొయ్యి తవ్వటం తేలికైన పనికాదు. కొండరాతినేల. అయినా కొన్నాళ్ళయే సరికీ, ఒకమనిషి దూరి అందులోనించి బైటికి పోయేందుకు వీలయ్యేటంత గొయ్యి తవ్వాడు.

తోటలో వున్నాడు. గోడ అవతలనుంచి నిక్కి చూచాడు జిలిన్. అతని కాలి బండకొయ్యకున్న గొలుసులు చప్పుడై వెంటనే ఆ ముసలివాడు పక్కకు తిరిగి పిస్టల్ తీసి పేల్చాడు. జిలిన్ గోడచాటుకు తప్పుకున్నాడు.

ముసలయ్య వెళ్ళి మురాద్‌కు ఫిర్యాదు చేశాడు. మురాద్ జిలిన్ను పిలిపించాడు. 'నువ్వు ఆయనింటికి ఎందు కెళ్ళావు?' నవ్వుతూ అడిగాడు.

'నేనేమీ దురుద్దేశంతో వెళ్ళలేదు. ఆయనగారు గార్హస్థ్యం ఎలా గడుపుచున్నారో చూద్దామని వెళ్ళాను.'

మురాద్ ఆ మాటే ముసలివానికి చెప్పాడు. ముసల య్యకు ఎక్కడలేని కోపం వచ్చేసింది. కోరలు బైటపెట్టి గల గల వాగుతూ, పిడికిళ్ళు పట్టి హంగామా చేశాడు.

జిలిన్‌కు ఆ మాటలేమీ అర్థం కాలేదు. 'రష్యావాళ్ళను ఇక్కడ అట్టిపెట్టుకుంటావా? చంపి పారెయ్యాలిగాని' అని ఆ ముసలివాడు మురాద్‌కు చెబుతున్నట్టుగా ఊహించాడు.

ముసలయ్య వెళ్ళిపోయాక 'ఏరెవరు?' అని అడిగాడు జిలిన్.

'ఆయన చాల గొప్పవాడులే. మా అందరిలోనూ గొప్ప ధైర్య సాహసాలుకలవాడు. ఒకప్పుడు, ఆయనకు ముగ్గురు భార్యలు, ఎనిమిదిమంది కొడుకులూ వుండేవాళ్ళు. అంతా ఒక పల్లెటూళ్ళో కాపురం ఉండేవాళ్ళు. ఒకసారి రష్యనులు వచ్చి ఆ గ్రామాన్ని నాశనం చేశారు. ఏడుగురు కొడుకుల్ని చంపేశారు. ఎనిమిదోవాడు ఒకడుమాత్రం మిగిలాడు. వాడు బుద్ధిపూర్వకంగా రష్యన్‌లకు లొంగి

పోయాడు. ఈ ముసలయ్యకూడా లొంగిపోయాడు. శ్వేళ్ళి రష్యన్‌లతో కలసి మూడు నెలలు ఉన్నాడు. ఆ తరువాత కొడుకును వెతకి ఎక్కడున్నాడో తెలుసుకున్నాడు. వాడిని చేతులార చంపేసి పారిపోయి వచ్చాడు. అక్కడినించీ యుద్ధం చెయ్యటం మానేశాడు. మా పుణ్యక్షేత్రమైన మక్కాకు వెళ్ళి వచ్చాడు. అందుచేతే తలగుడ్డ చుడతాడు టోపీమీద. మక్కాకు వెళ్ళి వచ్చినవాడిని మేము 'హాజీ' అంటాము. హాజీ అయితే తలపాగ ఉండాల్సిందే. అతనికి మీారంటే గిట్టదులే. నిన్ను చంపేయమని చెబుతున్నాడు. కాని ఎలా చంపను ? నిన్ను డబ్బుపెట్టి కొన్నాను. పైగా ఇన్నాళ్ళనించీ నువ్వంటే నాకు ఇష్టం ఏర్పడింది. నిన్ను నేను చంపలేను సరికదా; నిన్ను విడిచిపెట్టి వుండ లేమోననికూడా అనిపిస్తోంది. నువు చాల మంచివాడివి.'

## 4

ఒక నెల గడిచింది. జిలిన్ పగలంతా టిక్కీలో పచార్లు చేస్తూనో, లేకపోతే ఏవైనా వింత వస్తువులు తయారుచేస్తూనో కాలక్షేపం చేస్తాడు. రాత్రిళ్లుమాత్రం ఓపిగ్గా కూచుని ఒక మూల గోడపక్కన గొయ్యి తవ్వుతాడు. గొయ్యి తవ్వటం తేలికైన పనికాదు. కొండరాతినేల. అయినా కొన్నాళ్ళయే సరికీ, ఒకమనిషి దూరి అందులోనించి బైటికి పోయేందుకు వీలయ్యేటంత గొయ్యి తవ్వాడు.

ఒకవేళ గొయ్యిలోనించి బైటికి వచ్చినా...మళ్ళీ తార్తారులకు చిక్కకుండా పారిపోవాలంటే......దారి ఎట్లో తెలుసుకోవాలిగా! అందుకోసం ఒకనాడు యజమాని ఇంట లేనప్పుడు జిలిన్ బయలుదేరాడు, చుట్టూ దారీ డొంకా పరిశీలించి తెలుసుకోటానికి. ఆ పల్లెకు కొంచెం దూరంగావొక గుట్ట వుంది. ఆ గుట్టమీదికెక్కి పరిశీలన చెయ్యాలని అతని ఉద్దేశం. కాని యజమాని బైటికివెళ్ళేటప్పుడెల్లా తన కొడుకును పిల్చి జిలిన్ బైటికెక్కడికీ వెళ్ళకండా జాగ్రతగా కనిపెట్టిచూస్తూ ఉండమని ఆజ్ఞాపించివెడతాడు. ఆనాడు జిలిన్‌గుట్టవెపు ప్రయాణమయ్యాడో లేదో ఆ అబ్బాయి వెనకాలనించి వచ్చి, 'ఏయ్— నువు ఎక్కడికీ వెళ్ళటానికి వీల్లేదు. తిరిగి వచ్చేస్తావా లేదా? కేక వేసి అందర్నీ పిలవమన్నావా?' అని అదిలించాడు.

జిలిన్ ఆ కుర్రవాడిని బుజ్జగిస్తూ, 'ఎబ్బే, నేను చాల దూరం వెళ్ళటంలేదుగా! అదిగో ఆ గుట్టమీదికే వెళ్ళొస్తాను. వైద్యానికి ఒక మూలిక కావాలి. అది అక్కడ దొరుకుతుందేమోనని వెడుతున్నా, కావలిస్తే నువుకూడా నాతో రావచ్చు. కాలికి ఈ సంకెళ్ళు ఉండగా నేనెలా పారిపోగలనూ? రేపు నీకొక విల్లు, బాణాలు చేసిపెడతాలే' అన్నాడు.

కుర్రవాడు మాయలో పడ్డాడు. ఇద్దరూ కలసివెళ్ళారు. గుట్ట దూరంలేదు. కాని సంకెళ్ళతో నడవటం జిలిన్‌కు కష్టమైంది. చివరకిద్దరూ గుట్టమీదికెళ్ళారు. జిలిన్ అక్కడ ఆయాసంగా కూలబడి చుట్టూ జాగ్రత్తగా పరిశీలించాడు. దక్షిణంగా లోయ ఒకటి కనిపించింది. అక్కడ కొన్ని గుర్రాలు మేస్తున్నాయి. ఆ లోయ చివర ఒక గుడిసె ఉంది. దాని

అవతల రెండు కొండలు, ఆపైన అడవి. ఇంకా దూరంగా చాలా కొండలు ఉన్నాయి. అవి చాల యెత్తయినవి. శిఖరాలు మంచుతో నిండిఉండి, తెల్లగా మెరుస్తున్నాయి.

తూర్పున, పడమటకూడ అటువంటి పర్వతాలే ఉన్నాయి. ఆక్కడక్కడ ఉన్న గుడిసెల్లోనుంచి పొగవస్తోంది. 'బాబోయ్! ఇదంతా తార్తార్ల నివాసస్థలం అన్నమాటే!' అనుకున్నాడు జిలిన్.

ఉత్తరాన నదీ, తన్ను బంధించిన టిక్కీ కనిపించాయి. చిన్నచిన్న తోటలుకూడా కనిపించాయి. కొంతమంది ఆడవాళ్ళు నదిఒడ్డున చేరి బట్టలు ఉతుక్కుంటున్నారు. ఆపైన దూరంగా కొండల ఆవల ఒక మైదానం ఉన్నట్టు తోచింది. అక్కడ రష్యన్‌ల సైనికస్థావరం ఉంటే ఉండవచ్చు. పారిపోయేట్టయితే అటువేపే పారిపోవాలి.

సూర్యాస్తసమయం ఔతోంది. దూరాన కొండల తెల్లని మంచు శిఖరాలు ఎరుపురంగుకు తిరిగాయి. లోయల్లో పొగమంచు కమ్మింది. ఉత్తరపువేపు దూరాన ఆ మైదానంలో సూర్యరశ్మి అగ్నిజ్వాలల్లా కనిపిస్తోంది. అవతల కొండలోయలో నించి ఏదో పొగలాగ పైకి లేస్తున్నట్టు చూచాడు జిలిన్. అక్కడ తప్పకుండా రష్యనుల సైనిక స్థావరం ఉండితీరాలి అని నిశ్చయంచేసుకున్నాడు.

బాగా చీకటి పడింది. మాటిమాటికీ 'ఇంటికి పోదాం పద' అంటూ తార్తారు కుర్రవాడు తొందరచేస్తూనే ఉన్నాడు. జిలిన్ చాలసేపటివరకూ అతని మాటలు వినిపించుకోలేదు.

చివరకు ఇద్దరూ ఊళ్ళోకి తిరిగి వచ్చారు. పారిపోవ

ణానికి దోవ యెటో జిలిన్ ఊహించుకున్నాడు. ఆరాత్రి వలా యనం చెప్పటానికి నిశ్చయించుకున్నాడు. చీకటి రాత్రిలే. మంచి వీలుగానే ఉంటుంది పారిపోడానికి. కాని దురదృష్ట వశాత్తు ఊళ్ళోకి తార్తారులు ఆ సాయంత్రమే వచ్చారు. వాళ్ళు ఎప్పుడు ఊళ్ళోకి వచ్చినా అక్కడా ఇక్కడా దోచు కున్న సొత్తుతో ఆనందంగా వస్తారు. ఈ సారి మాత్రం వాళ్ళు కోపంగా, చిరాకుగా వున్నారు. ఎక్కడో రష్యనులతో కొట్లాట జరిగింది కామాలు! ఒక తార్తారు ఆ దెబ్బలాటలో చనిపోయాడు. అతని శవాన్ని తీసుకుని ఇంటికొచ్చారు. ఆ శవాన్ని పాతిపెట్టే ప్రయత్నంలో ఉన్నారు. జిలిన్ కూడా చూడ్డానికి వెళ్ళాడు. ఆ చనిపోయినవాడు ఎర్రగడ్డం తర్తారు సోదరుడు.

తార్తారులు ఆశవాన్ని ఒక గుడ్డలో చుట్టారు. పెట్టెలో పెట్టలేదు. ఊరి వెలుపలదాకా మోసుకుపోయారు. అక్కడ నేలమీద దించారు. అంతా వరుసగా మోకాళ్ళమీద నిల్చు న్నారు. అందరూ టోపీల చుట్టూ తుండుగుడ్డలు చుట్టు కున్నారు.

ముందు ముల్లా ,అతని వెనుక ముగ్గురు ముసలివాళ్ళు, ఆ వెనుక మిగిలిన తార్తారులంతాను. చాలసేపు తలలు వంచు కుని నిశ్శబ్దంగా ఉన్నారు. చివరకు ముల్లా తలెత్తి 'అల్లా' అన్నాడు. ఆ తరువాత మళ్ళీ కొంతసేపు అందరూ నిశ్శబ్దంగా ఉండిపోయారు. ఉలుకు లేదు, పలుకులేదు.

మరొకసారి ముల్లా తలెత్తి 'అల్లా' అన్నాడు. అదే పదాన్ని మిగిలినవారందరుకూడా ఉచ్చరించి మళ్ళీ మౌన ముద్రలో ఉండిపోయారు.

శవం అలాగే నేలమీద పడివుంది. వాళ్ళూ శవాల్లాగే చలనం లేకుండా ఉన్నారు. మెట్టుపట్ల గాలికి ఊగే ఆకుల చప్పుడు తప్ప అంతా నిశ్శబ్దం. తరువాత ముల్లా ఒక ప్రార్థన చదివాడు. అందరూ లేచి నిల్చున్నారు. శవాన్ని ఒక గొయ్యి వద్దకు తీసుకపోయారు. అందులో శవాన్ని చేతులు ముందుం డేట్టు కూచోపెట్టి పైన మట్టికప్పేశారు. పైన ఒకనిలువురాయి ఉంచారు. 'అల్లా' 'అల్లా' అని అరచి అందరూ నిట్టూర్పులు విడిచారు.

ఎర్రగడ్డం తార్తారు ముసలివారికి సంభావన లిచ్చాడు. ఒక కొరడా పుచ్చుకుని తన నుదిటిమీద మూడుసార్లు కొట్టు కున్నాడు. అందరితో కలిసి ఊళ్ళోకి వెళ్ళిపోయాడు.

మర్నాడు ఎర్రగడ్డం తార్తారు ఒక ఆడగుర్రాన్ని తీసు కుని ఊరివెలుపలకు వెళ్ళాడు. అతనితోపాటు ఇంకా ముగ్గురు కూడా వెళ్ళారు. ఎర్రగడ్డం తార్తారు ఒక కత్తి తీశాడు. అక్కడొక రాయిమీద నూరి పదును పెట్టాడు. మిగిలిన ముగ్గురు గుర్రం మెడ ఎత్తి పట్టుకున్నారు. అతడాకత్తితో ఒక్క వేటున గుర్రం మెడ తెగేశాడు. గుర్రం నేలకొరిగి చచ్చి పోయింది. అతడా పైన చర్మం అంతా శుభ్రంగా వొలి చాడు. అప్పుడు ఆడవాళ్ళు, పిల్లలువచ్చి నీళ్ళుపెట్టి కడిగాడు. ముక్కలు ముక్కలుగా కోశారు. ఆ ముక్కలన్నీ పాకలోకి తీసుకు వెళ్ళారు. ఊరివారంతా ఆనాడు ఎర్ర గడ్డం తార్తారు పాకలో విందు ఆరగించారు.

మూడు రోజులు వరుసగా విందులే. ఇష్టం వచ్చినట్టు సారాయం తాగారు. చనిపోయినవాని ఆత్మ శాంతికి ప్రార్థ

నలు చేశారు. నాలుగోనాడు తార్తారు పురుషులంతా మళ్ళీ దోపిడికి బయలుదేరారు. గుర్రాలు సిద్ధంచేసి పెట్టుకున్నారు. మొదట పదిమంది ముందు బయలుదేరి వెళ్ళారు. వారిలో ఎర్రగడ్డం తార్తారుకూడా ఉన్నారు. అబ్దుల్ మురాదు మాత్రం వెళ్ళలేదు. ఇంటివద్దే ఉండి పోయాడు. ఆనాడు అమావాస్య. 'ఈ రాత్రే ఇక్కడినించి తప్పించుకు పారిపోవాలి. ఇంతకంటే మంచిసమయం దొరుకదు' అనుకున్నాడు జిలిన్. కోస్టిలిన్‌తోకూడా తన ఉద్దేశాన్ని చెప్పాడు.

'ఎలా పోగలం మనం? మనకు దారికూడా తెలీదాయెను.' అన్నాడు కోస్టిలిన్.

'నాకు దారి తెలుసు.'

'దారి తెలిస్తే మాత్రం? - ఒక్క రాత్రిలో మనం రష్యన్ కోటకు చేరుకోగలుగుతామా?'

'చేరుకోలేకపోతే అడవిలో దాక్కుందాం. నా దగ్గర జొన్నగడ్డలు దాచిపెట్టి ఉంచాను. తిండికి అవస్థ పడక్కర్లేదు. ఇక్కడ ఇలాగ ఎన్నాళ్ళని ఉంటాం? మీ వాళ్ళు నీకు డబ్బు పంపిస్తే సరేననుకో. అంత డబ్బు వాళ్ళకు దొరక్క, పంపించక పోతే ఏం చేస్తావు? రష్యన్‌లు ఆ యెర్రగడ్డం తార్తారు సోదరుని చంపారుట, విన్నావుగా! అందుచేత వాళ్ళు చాల కోపంగా ఉన్నారు. అందుకు ప్రతీకారంగా మనిద్దర్నీ చంపెయ్యాలని చూస్తున్నారు. తెలుసునా?'

కోస్టిలిన్ కాస్త ఆలోచించాడు. 'సరే, నీ యిష్ట ప్రకారమే కానీ' అన్నాడు చివరకు.

# 5

జిలీన్ గొయ్యిలోకి దిగాడు. ఇంకా కొంచెం బాగా వెడల్పు చేశాడు. ఊరు మాటు మణిగిందాకా టిక్కీలోనే ఉన్నారు ఇద్దరూ.

అర్ధరాత్రి దాటిన తర్వాత జిలీన్ గొయ్యిలోనించి బైటికి వచ్చేశాడు. 'నువ్వు కూడా వచ్చెసెయ్యి' అని నెమ్మదిగా కోస్టిలిన్‌ను హెచ్చరించాడు. కోస్టిలిన్ కూడా గొయ్యిలోనించి వస్తూంటే ఒక రాయి కాలికి కొట్టుకుని చప్పుడైంది. యజమాని కాపలా కుక్క ఆ చేరువనే పాక దగ్గర ఉందిగా! అది మహా చెడ్డ కుక్క. చప్పుడు వినగానే ముందుకు దూకి మొరిగింది. ఇంకా ఇతర కుక్కలు కూడా మొరుగసాగాయి. వెంటనే జిలీన్ ముందుకువచ్చి, మెల్లిగా ఈల వేస్తూ, ఒక జున్నుగడ్డ దాని దగ్గరకు విసిరి వేశాడు. ఆ కుక్క మొరగటం ఆపేసి తోకాడిస్తూ దగ్గరకు వచ్చింది. కొన్నాళ్ళనించీ జిలీన్ ఆ కుక్కను బాగా మచ్చిక చేసుకున్నాడు...అడపా, తడపా జున్నుగడ్డల రుచి చూపిస్తూ.

కుక్క మొరుగుడు వినగానే లోపల యజమాని మేలుకొన్నాడు. కుక్కను పేరుపెట్టి పిల్చాడు, 'ఏమిటిది? ఏమిటిది?' అని కేకవేశాడు. కాని కుక్క మళ్ళీ మొరగలేదు. జిలీన్ దాని వొళ్ళు నిమురుతూ ఉన్నాడు. అది తోకాడిస్తూ అతని కాళ్ళ దగ్గర కూచుంది.

మరి కాసేపటివరకూ జిలీన్, కోస్టిలిన్ ఆ టిక్కీ బైట ఒకమూల చప్పుడు కాకుండా కూచున్నారు. అమావాస్య చీకటి.

ఆకాశాన నక్షత్రాలు ప్రకాశిస్తున్నాయి. అంతా నిశ్శబ్దంగా వుంది.

చివరకు జిలిన్ లేచాడు. 'రా! ఇక పోదాం రా.' అన్నాడు కోస్టిలిన్‌తో.

ఇద్దరూ బయలుదేరారు. కొన్ని అడుగులు వేశారో లేదో... 'అల్లా, బిస్మిల్లా, ఇల్‌రహమాన్' అంటూ ముల్లా బిగ్గరగా అరుస్తూ వుండటం వినిపించింది. అంటే...నమాజు చెయ్యడానికి అందర్నీ రమ్మంటూ పిలుస్తున్నాడన్నమాట. జిలిన్ తన మిత్రునితోసహా ఒకగోడ దగ్గర నక్కారు. తార్తారు లంతా మసీదుకు వెళ్ళారు. మళ్ళీ అంతా నిశ్శబ్దం అయి పోయింది.

ఆ యిద్దరూ మళ్ళీ ఒకసారి భగవంతుని తలచుకుని బయలుదేరారు. తిన్నగా కొండ పక్కకు వెళ్ళారు. నది దాటారు. లోయలో ప్రవేశించారు.

పొగమంచు దట్టంగా కమ్మివుంది. ఆకాశాన ప్రకాశిస్తున్న నక్షత్రాలను గుర్తుంచుకుని దారి తీస్తున్నాడు జిలిన్. నడక సాఫీగానే సాగుతోంది. కాని తొడుక్కున్న బూట్లు చినిగినవి, పాతవి. అవి ప్రతిబంధకంగావున్నాయి. జిలిన్ తన బూట్లుతీసి అవతల పారేశాడు. చకచక నడుచుకుంటూ పోతున్నాడు. కోస్టిలిన్‌మాత్రం వెనుకపడ్డాడు.

'ఈ బూట్లమూలాన నా పాదాలు పుళ్ళుపడిపో తున్నాయి. కొంచెం నెమ్మదిగా నడుద్దూ' అన్నాడు కోస్టిలిన్.

'తీసి పారేసెయ్యి; బాగా నడువ గలుగుతావు.'

కోస్టిలిన్ కూడా బూట్లు తీసి పారేశాడు. కాని రాళ్ళు గుచ్చుకుంటున్నాయి. బాధగావుండి, చాలవెనుకపడిపోయాడు. 'కాళ్ళకు రాళ్ళు గుచ్చుకుంటే మందువేసుకుని తిన్నగా మాన్పుకోవచ్చు. తార్తారులువచ్చి పట్టుకున్నారంటే మాత్రం మనల్ని చంపేస్తారు. త్వరగానడు' అన్నాడు జిలిన్. కోస్టిలిన్ జవాబేమీ చెప్పలేదు. అలాగే కాళ్ళీడ్చుకుంటూ నడుస్తున్నాడు.

చాలసేపటివరకూ ఆ లోయగుండానే నడిచివెళ్ళారు. చివరకు కుడివైపున దూరాన కుక్కలు మొరగటం వినిపించింది. జిలిన్ ఆగిపోయాడు. చుట్టూ చూచాడు. తిన్నగా కొండమీదికి ఎగబ్రాకుతున్నాడు...'అరెరే, దోవ తప్పాం. చేరువనే తార్తారుల గుడిసె ఒకటి ఉంది. కుడివేపుకు వెళ్ళకూడదు. ఎడమవైపు కొండమీదికి ఎక్కాలి' అన్నాడు. 'కాస్త ఆగు. ఊపిరి పీల్చుకోనీ – నా కాళ్ళన్నీ రాళ్ళు గుచ్చుకుని నెత్తురు కారుతున్నాయి.' అన్నాడు కోస్టిలిన్.

'పరవాలేదు. దబ్బునే మానిపోతాయిలే. పిట్టలాగ ఎగిరి వచ్చెయ్యి' అంటూ జిలిన్ వెనక్కు వచుగెత్తి, ఎడమవైపు కొండమీదికి ఎగబ్రాకి ఒక చిట్టడివిలో ప్రవేశించాడు.

మరి కాసేపటికి కోస్టిలిన్ కూడా వచ్చి అతన్ని కలుసుకున్నాడు. ఇద్దరూ ఆ చిట్టడివిలో దోవచేసుకుంటూ వెళ్ళారు. కొమ్మలు గీచుకుని వాళ్ళ దుస్తులు చాలావరకు చినిగిపోయాయి. చివరకొక కాలిబాట కనిపించింది. దాన్ని పట్టుకుని వెడుతున్నారు.

ఇంతలో ఏదో శబ్దం వినిపించింది. గుర్రపుగిట్టల చప్పుడులాగ ఉంది. ఇద్దరూ ఆగారు. ఆ చప్పుడు మళ్ళీ వినిపించలేదు.

జిలిన్ ఆగి పరకాయించి చూచాడు. వెనకాల కొంతదూరాన ఏదో కనిపించింది గుర్రంలాగే ఉంది, గుర్రంలాగానూ లేదు. మీాద ఏదో విచిత్రమైన ఒక ఆకారం కనిపించింది. మనిషి కాదేమో! మరేమిటి? జిలిన్ సన్నగా ఒక ఈలవేశాడు. వెంటనే అది పక్కకు తిరిగి ఆ చిట్టడివిలో దూసుకుపోయింది. ఒక తుఫానుగాలి వీచినట్టు ధ్వని అయింది.

కోస్టిలిన్ చాల భయపడిపోయాడు. నేలమీాద కూలబడ్డాడు జిలిన్‌మాత్రం ధైర్యంగా నవ్వాడు. 'అది దుప్పి. దాన్ని చూచి మనం భయపడ్డాం; మనల్ని చూచి అది భయపడదు.'

మళ్ళీ ఇద్దరూ ముందుకు సాగారు. అరుణోదయం కావచ్చింది. తాము వెడుతున్నది సరైన దోవో, కాదో తెలీదు. రష్యన్‌ల సైనికస్థావరం చేరుకోవాలంటే ఇంకా ఏడు మైళ్ళు వెళ్ళాల్సి ఉంటుందని జిలిన్ అనుకుంటున్నాడు. కాని అతనికి బాగా తెలియదు. చీకటిగా ఉందాయెను. సక్రమమైన దోవనే వెడుతున్నట్టు నమ్మకం ఏముందీ?

చివరకు కోస్టిలిన్ నేలమీాద కూలబడ్డాడు. 'ఇక నేను ఒక్క అడుగుకూడా వెయ్యలేను. నీ యిష్టం'

జిలిన్ అతనికి ధైర్యం చెప్పబోయాడు. కాని లాభం లేకపోయింది.

'ఉహుఁ. నేను నడవలేను' అన్నాడు కోస్టిలిన్. జిలిన్‌కు కోపం వచ్చింది. 'అయితే సరే, నేనొక్కడినే వెళ్ళిపోతాను.' అంటూ ముందుకు సాగాడు.

వెంటనే కోస్టిలిన్‌కూడా లేచి అతన్ని అనుసరించాడు. ఇంకో మూడుమైళ్ళు వెళ్ళారు. నక్షత్రాల వెలుతురు తగ్గిపో

యుంది. పొగమంచు దట్టంగా వ్యాపించింది. ముందు దోవ కనిపించటంలేదు.

ఇంతలో ఎదురుగా కొన్నిగజాలముందు గుర్రపుడెక్కల చప్పుడు.

ఇద్దరూ బాట వొదిలేసి చిట్టడివిలో జొరబడ్డారు. ఒక పొదమాటున దాక్కున్నారు. ఒక తార్తారు గుర్రం ఎక్కి ఈల వేసుకుంటూ వెళ్ళిపోయాడు.

'భగవంతుని దయవల్ల బ్రతికిపోయాం. వాడు దాటి పోయాడులే. ఇక లేచిపోదాం పద' అన్నాడు జిలిన్. కోస్టిలిన్ లేవటానికి ప్రయత్నించాడు. కాని లేవలేక పోయాడు. తూలి పడ్డాడు. జిలిన్ అతన్ని లేవదీయటానికి ప్రయత్నించాడు. "అమ్మో' అంటూ బాధగా అరిచాడు కోస్టిలిన్.

'అంత పెద్దగా అరుస్తావేమిటి? ఆ తార్తారు ఎంతో దూరం పోయివుండడు. వాడు విన్నాడంటే మనకొంప మునిగి పోతుంది'— అని మందలించాడు జిలిన్.

కోస్టిలిన్‌ లేచి నిలబడే స్థితికూడాలేదు. అర్ధంతరంగా మిత్రుని దిగవిడచి పారిపోవటం అతనికి యిష్టంలేదు. అమాంతంగా కోస్టిలిన్‌ను భుజాన వేసుకుని దారి పట్టాడు. 'జాగ్రతగా నావీపుమీద ఉండుబాబూ; మెడకాయ గట్టిగా కరచి పట్టుకోకు' అని మధ్యమధ్య కోస్టిలిన్‌ను హెచ్చరిస్తూ నడుస్తున్నాడు.

కాని మనిషిని మోసుకపోవుటం తేలికైన పనికాదు. జిలిన్‌కూడా పాపం చాల అలసిపోయి ఉన్నాడు. కాళ్ళు చచ్చుపడిపోతున్నాయి. రాళ్ళు గుచ్చుకుని నెత్తురు కారుతున్నాయి. అయినా ఓపిగ్గా మోసుకుపోతున్నాడు.

చాలాదూరం వెళ్ళాడు. ఇంతలో హఠాత్తుగా వెనక నుంచి గుర్రపు గిట్టల చప్పుడు వినిపించింది. తార్తారు భాషలో కొన్ని కేకలుకూడా వినిపించాయి. ఇందాకటి కోస్టిలిన్ అరుపు ఆ తార్తారు రౌతు విన్నాడు కామాలు—కొంపదీసి.

జిలిన్ వెంటనే దోవ విడిచిపెట్టేశాడు. పక్కకు తప్పుకున్నాడు. పొదలమాటున దాక్కున్నాడు. ఆ తార్తారు రౌతు తుపాకి పేల్చాడు. కాని అపాయం ఏమీ జరగలేదు. తార్తారు భాషలో బిగ్గరగా కేకలు వేసుకుంటూ రౌతు గుర్రంమీద సాగిపోయాడు.

'మనకు చావు మూడినట్లే. ఆ కుక్క వెధవ తార్తారులందర్నీ కూడదీసుకుని వస్తాడు. మనల్ని వేటాడి పట్టుకుంటారు. తప్పదు. నా ప్రాణానికి నువ్వు ఒక గుదిబండలా దాపురించావు. నేను ఒక్కడినే అయితే ఈపాటికి సురక్షితంగా దాటిపోయి వుండేవాడినే'—అన్నాడు జిలిన్.

'పో, నువ్వు ఒక్కడివే పో. నాకోసం నువ్వెందుకూ—ప్రాణంమీదికి తెచ్చుకోటం ?'—అన్నాడు కోస్టిలిన్.

'నిన్ను ఈ స్థితిలో విడిచిపెట్టి ఎలా వెళ్ళను ?'

జిలిన్ మళ్ళీ కోస్టిలిన్‌ను వీపుమీద ఎక్కించుకుని ముందుకు సాగాడు. ఆకాశాన నక్షత్రాలు మాయమైపోయాయి. పొగమంచు కూడా నిల్చిపోయింది. చుట్టూ చిట్టడివి అంతూపంతూ లేకుండా ఉంది. ఒక అరమైలు నడిచాక ఒక సెలయేరు కనిపించింది. ఆ యేటి ఒడ్డున జిలిన్ ఆగాడు. వీపుమీదనించి కోస్టిలిన్‌ను దించి కూచోబెట్టాడు

తెచ్చుకున్న జున్ను ముక్కలు తిని కాస్త నీళ్ళు తాగుదామని అనుకున్నాడు జిలిన్. వంగి ముఖం కడుక్కుంటూ ఉంటే వెనకనుంచి గుర్రాల గ్యాలప్ చప్పుడు వినిపించింది. గుండె దడదడతో జిలిన్ మిత్రుని తీసుకుని పక్కకు తప్పుకుని పొదలమాటున దాక్కున్నాడు. మరి కాసేపటికి తార్తార్ల కంఠ ధ్వనులు వినిపించాయి.

చాలమంది తార్తార్లు సెలయేటి ఒడ్డున మూగారు. గల గల - ఏమిటో మాటాడుకున్నారు. చివరకో కుక్కను ఉసి గొలిపి తోలారు.

ఆ కుక్క మూతి చూచుకుంటూ, జిలిన్ దాక్కున్న పొద దగ్గరకు వచ్చి మొరిగింది. తార్తారులంతా ఆచోటికి వచ్చిపడ్డారు. ఇంకేముంది! ఇద్దర్నీ రెక్కలు విరిచి కట్టి గుర్రాలమీాద వేసుకుని వెళ్ళిపోయారు. నేరుగా తార్తార్ల పల్లెకు తీసుకుపోయి అబ్దుల్ మురాద్‌కు ఒప్పజెప్పారు.

తార్తారు పల్లె వీధిలో నిలబెట్టారు ఇద్దర్నీ. పిల్లలు గుంపులు గుంపులుగా చూడవచ్చి రాళ్ళు - రప్పలు విసిరారు వాళ్ళమీాదికి. కొరడాలు పుచ్చుకుని కొట్టారు. ఆనందంగా కేరింతలు కొట్టారు.

తార్తారు పెద్దలంతా కూడా గుమిగూడారు. కొండ అడుగున గుడిసెలో ఉంటోన్న ముసలి తార్తారుగూడా హాజరైనాడు. అందరూ కలసి చాలాసేపు చర్చించారు. వీళ్ళిద్దర్నీ ఏం చెయ్యాలి అనే విషయమై తర్జన భర్జనపడ్డారు. ఆ ముసలి తార్తారు మాత్రం కచ్చితంగా చెప్పేశాడు. 'వీళ్ళిద్దర్నీ చంపి పారేయ్యాల్సిందే' నని.

'వాళ్ళను నేను డబ్బుపెట్టి కొన్నాను. చంపేస్తే నాకేం లాభం?' – అన్నాడు అబ్దుల్ మురాద్.

'వాళ్ళు ఇంటిదగ్గర్నించి డబ్బు తెప్పించి నీ కిస్తారన్న మాట కల్ల. వాళ్ళను ఇక్కడ అట్టిపెట్టుకున్నందువల్ల నీకు అనిష్టమే గాని మరేం లేదు. రష్యన్‌లకు కూడు పెట్టి పోషించటం మహాపాపం. తక్షణం చంపి పారెయ్యి; పీడా వదలిపోతుంది'. అన్నాడు ముసలి తార్తారు.

తార్తారులంతా ఎక్కడివాళ్ళక్కడ వెళ్ళిపోయారు. అబ్దుల్ మురాదు జిలిన్ దగ్గరకు వచ్చాడు. 'అబ్బాయ్! ఒక పక్షం రోజుల్లో గనక నువ్వు ఇంటిదగ్గరనుంచి డబ్బు తెప్పించ లేక పోయావంటే...తోళ్ళు వాచేట్టు కొరడా దెబ్బలు కొట్టి స్తాను. ఇలాగ పారిపోటానికి మళ్ళీ ప్రయత్నించావంటే ప్రాణం తీసేస్తాను. ఇంకోసారి ఇంటికి వుత్తరం రాయి. జాగ్రతగా రాయి.'

కాగితాలు, కలాలు తెచ్చారు. జిలిన్, కోస్టిలిన్ ఉత్త రాలు రాశారు. కాళ్ళకు సంకెళ్ళు తగిలించి ఇద్దర్నీ తీసుకు పోయి మసీదు వెనుక ఒక గొయ్యిలోకి దించారు. అది చాల లోతైన గొయ్యి. పన్నెండు చదరపు అడుగుల వైశాల్యం వుంది.

## 6

ఇప్పుడు ఇద్దరికీ బ్రతుకు చాల ఘోరంగా తయారైంది. సంకెళ్ళు తీయటం లేదు. బైటి కెక్కడికీ పోవటానికి

వీల్లేదు. ఉడికీ ఉడకని కూడు పెడుతున్నారు. మంచినీళ్ళు ఒక బొక్కెనలో పోసి తాడుగట్టి లోపలికి దించుతున్నారు.

గొయ్యి లోపల అంతా చెమ్మగా ఉంది. కోస్టిలిన్‌కు ఆరోగ్యం బాగా చెడిపోయింది. ఒళ్ళంతా వుబ్బింది. కీళ్ళు నొప్పులు పెడుతున్నాయి. అస్తమానం మూలుగుతూవున్నాడు. జిలిన్ దిగాలు పడిపోయాడు. ఈ బంధిఖానాలోనించి బైటపడే మార్గం ఏమీ కన్పించటంలేదు. ఆ గొయ్యిలోనించి ఒక సొరంగం తవ్వుదామని ప్రయత్నం ఆరంభించాడు. కాని తవ్వగా వచ్చిన మట్టి అంతా ఏం చెయ్యాలి? అబ్దుల్ మురాదు ఈ విషయం కనిపెట్టాడు. 'చంపి పారేస్తా. జాగ్రత' అని బెదిరించాడు.

ఒకనాడు జిలిన్‌కు ఆ గొయ్యిలో తీరుబాటుగా కూచున్నాడు. పైనించి రెండు రొట్టెలు పడ్డాయి అతని ఒడిలో. ఆ తరువాత కొన్ని రేగిపళ్ళుకూడా పడ్డాయి. జిలిన్ తలెత్తి చూచాడు. పైన దీనా కనిపించింది. ఆ పిల్ల అతన్ని చూచి, నవ్వి తిరిగి వెళ్ళిపోయింది. 'ఈ పిల్ల యేమన్నా సాయ పడుతుందేమో!' అనుకున్నాడు జిలిన్.

గొయ్యిలోనించి మట్టి కొంతతీసి జిలిన్ బొమ్మలు చేశాడు. కుక్కలు, గుర్రాలు, ఏనుగులు – చాలా చేశాడు. అవన్నీ...ఈసారి దీనా వచ్చినప్పుడు ఇద్దామనుకున్నాడు. కాని దీనా ఆ మర్నాడుకూడా రాలేదు. తార్తారు లంతా మసీదువద్ద సమావేశమై గలభాగా మాటాడుకుంటూ ఉండటం వినిపించింది. ముసలి తార్తారుకూడా ఏమో అరుస్తూనే ఉన్నాడు. మాటిమాటికీ 'రష్యన్‌లు' అనే పదం మాత్రం వినిపిస్తూఉంది.

ప్రతి పదమూ అర్థంగాకపోయినా జిలిక్...వాళ్ళ సంభాషణను బట్టి గ్రహించిందేమంటే...రష్యన్ దళాలు ఈ చేరువలోనే ఎక్కడికో వచ్చాయిట - ఏ నిమిషాన్నయినా ఈ తార్తార పల్లెమీద వచ్చి పడచ్చు. తాము ఏం చెయ్యాలి? ఈ ఖైదీలను ఏం చెయ్యాలి? ఇదీ తార్తార్లు చర్చిస్తూన్న అంశం.

మరి కాసేపటికి తార్తారులంతా సమావేశం ముగించుకుని వెళ్ళిపోయారు. దీనా గొయ్యిదగ్గరకు వచ్చి లోపలికి చూచింది. ఆమె కళ్ళు నక్షత్రాల్లా మెరుస్తున్నాయి. జున్ను గడ్డలు తీసి లోపలకు జారవిడిచింది. జిలిన్ వాటిని అందుకున్నాడు. 'నీకోసం చాల బొమ్మలు చేశాను, ఇందాకటినించీ రానేలేదేం?' అని పలుకరించాడు.

'నాకు బొమ్మలేం అక్కర్లేదు. ఇదిగో చూడు. వాళ్ళు నిన్ను చంపేస్తారుట' - అంటూ దీనా తన కంఠం పట్టుకు చూపించింది.

'ఎవరు నన్ను చంపేది?'

'మా నాన్నే. మా ముసలయ్య నిన్ను చంపెయ్యాల్సిందే నంటున్నాడు. పాపం, నిన్ను చూస్తే నాకు జాలి... అంటోంది.'

'అయితే ఒక పెద్ద గడ తెస్తావూ?'

'ఊహుఁ, నేను తీసుకురాను. అమ్మో!'

'ఇదిగో - మంచి అమ్మాయివి కదూ! నా మాట వినవూ?'

'ఊహుఁ. అంతా ఇక్కడే వున్నారు. వాళ్ళు చూచా రంటేనా...' అంటూ దీనా వెళ్ళిపోయింది.

సాయంత్రం అయింది. చీకటి పడింది నక్షత్రాలు ప్రకాశిస్తూన్నాయి. ముల్లాగారి అరుపు వినిపించింది. తరువాత అంతా నిశ్శబ్దం. జిలిన్‌కు కాస్త కునుకు పట్టింది.

మరి కాసేపటికి పైనించి మట్టి రాలుతోంది. జిలిన్‌కు మెళుకువ వచ్చింది. ఒక గడ తిన్నగా కిందికి జారుతూవస్తోంది. జిలిన్ సంతోషించాడు. ఆప్యాయంగా దాన్ని అందుకున్నాడు. అది పొడుగ్గా, గట్టిగా వుంది.

జిలిన్ పైకి చూచాడు. ఆకాశాన నక్షత్రాలు ప్రకాశిస్తున్నాయి. పిల్లి కళ్ళలాగా దీనా నేత్రాలు మెరుస్తున్నాయి.

'ఇదిగో చూడు...' దీనా ఏమిటో చెప్పబోయింది.

'ఏమిటి?'

'అంతా వెళ్ళిపోయారు. ఇద్దరే వున్నారు.'

'అయితే కోస్టిలిన్! చప్పునలే - ఇంకొక్కసారి ప్రయత్నించేద్దాం. నీకేం భయంలేదు, నే నున్నానుగా!'

కోస్టిలిన్ చాలనిరుత్సాహంగా ఉన్నాడు. 'నేను కదల్లేని స్థితిలో ఉన్నాను. ఎలా వచ్చేది.?'

'అయితే నేను వెడతాను. భగవంతుడు నిన్ను రక్షిస్తాడు గాక! నన్ను దుర్మార్గుడనుకోకు సుమీ!'

ఇద్దరూ ఒకరినొకరు కావిలించుకున్నారు. గడను గోడకు అనించాడు జిలిన్. పైన దీనా గట్టిగాపట్టుకుంది. జిలిన్ దాన్ని ఎగబ్రాకి అతి కష్టంమీద పైకి వచ్చేశాడు. గడను పైకిలాగేసి

దీనాకు ఇచ్చేశాడు! 'తీసుకపోయి ఎక్కడుందో అక్కడ పెట్టేయి. లేకపోతే నువు దెబ్బలు తినాల్సివస్తుంది.'

దీనా ఆ గడతీసుకుని వెళ్ళిపోయింది. జిలిన్ నెమ్మదిగా కొండదిగాడు. అక్కడ ఒకచోట కూలబడి కాలికి తగిలించిన సంకెళ్ళు రాయితో పగలగొట్టాలని ప్రయత్నించాడు. లాభం లేకపోయింది. ఇంతలో ఎవరో కొండ దిగివస్తూన్న చప్పుడైంది. దీనా కామాలు అనుకున్నాడు జిలిన్.

దీనా వచ్చి అతని దగ్గరే కూచుంది. తానూ ఒకరాయి తీసుకుని సంకెళ్ళు పగలగొట్టాలని ప్రయత్నించింది. ఆపని చేత నౌతుందా? తామర తూడుల్లాంటి చేతు లామెవి. చేతిలోని రాయి పారేసి ఏడుస్తూ కూచుంది. జిలిన్ ఒకరాయి తీసుకొని మళ్ళీ ప్రయత్నించాడు. దీనా అతని భుజం ఆనుకుని దీనంగా నిల్చుంది.

ఎడమవైపు కొండకు ఆవల ఎర్రగా దీపం ఒకటి కనిపిస్తోంది. అప్పుడే చంద్రబింబం ఉదయిస్తోంది. 'ఈపాటికి ఈ లోయ దాటి అడివిదాకా వెళ్ళాల్సిఉండె' అనుకున్నాడు జిలిన్. వెంటనే లేచాడు. ఈ సంకెళ్ళు అలాఉన్నాసరే బయలు దేరి వెళ్ళాల్సిందే – ఆలస్యం చెయ్యకూడదు.

'వెళ్ళొస్తాను దీనా! నిన్ను నేను ఎన్నటికీ మరచిపోను' అన్నాడు.

దీనా అతని చెయ్యి గట్టిగా పట్టుకుంది. తన జేబులో నుంచి జున్ను ముక్కలు తీసి అందించింది.

జిలిన్ అవి తీసుకున్నాడు. 'దీనా! నేను వెళ్ళిపోయాక నీకు బొమ్మలు – అవీ ఎవరు చేసిపెడతారు?' అన్నాడు.

దీనా వెక్కి వెక్కి ఏడ్చింది. మరి కాసేపటికే వెనక్కు తిరిగి చిన్న మేక పిల్లలాగ కొండెక్కి వెళ్ళిపోయింది.

జిలిన్ భగవంతుడ్ని తలచుకుని దారిపట్టాడు. ఇప్పుడతనికి దారి బాగానే తెలుసు. చంద్రుడు ఉదయించి బారెడెక్కేసరికి ఆరుమైళ్ళు పోయాడంటే అడవి చేరుకుంటాడు. ఆ తరువాత ఇక భయంలేదు.

జిలిన్ త్వరత్వరగా నడవసాగాడు. అడివి సమీపించే సరికి చంద్రబింబం బారెడెక్కి వచ్చింది. పిండారబోసిన వెన్నెల. పట్టపగల్లా ఉంది. కాని ఎక్కడా చడీ - చప్పుడు లేదు.

జిలిన్ అడివిలో ప్రవేశించాడు. ఒకచోట కాస్త విశ్రాంతి తీసుకుందామని కూలబడ్డాడు. కాసిని జున్నుముక్కలు తిన్నాడు. ఒక రాయి పుచ్చుకుని కాలికి ఉన్న సంకెళ్ళు పగులగొడదామని మరొకసారి ప్రయత్నించాడు. కాని లాభం లేకపోయింది. మళ్ళీ దారి పట్టాడు. రాత్రంతా నడుస్తూనే ఉన్నాడు. కాళ్ళు తీపులు పెడుతున్నాయి. కూచుంటే తిరిగి లేవలేకపోతానేమోనన్న భయంచేత ఎక్కడా ఆగలేదు.

ఇద్దరు తార్తారు గుర్రాలెక్కి ఆ దారినే వెళ్ళారు. వాళ్ళ గుర్రాల డెక్కల చప్పుడు దూరాన్నించే వినిపించాయి. కాబట్టి ఆ కాసేపూ జిలిన్ ఒక పొదమాటున దాక్కుని తప్పించుకున్నాడు.

చంద్రబింబం వెలవెల బోతోంది. మంచు బిందువులు రాలుతున్నాయి. జిలిన్ ఎలాగైతేనేం అడవి దాటాడు. బాగా తెల్లవారిపోయింది. ముందు మైదానం కనిపిస్తోంది. ఆపైన రష్యన్‌ల సైనికస్థావరం ఉంది. దూరాన ఎడమపక్కన కొంత మంది చలిమంట వేసుకుని చుట్టూ కూచుని ఉన్నారు.

జిలిన్ పరకాయించి చూచాడు. వాళ్ళదగ్గర తుపాకులు కూడా ఉన్నాయి. అనుమానం ఎందుకూ? వాళ్ళ రష్యన్ సైనికులే.

జిలిన్‌కు ఆనందం కలిగింది. నరాలు కూడగట్టుకుని ముందుకు సాగాడు. అమ్మయ్య! సురక్షిత స్థానాన్ని చేరుకోబోతున్నాను కాని భయంగానే ఉంది. ఈ కాస్తదూరం నడవ గలుగుతానా? ఈ మైదానంలోనించి వెడుతున్నప్పుడు ఏ తార్తారుకైనా కంటపడతానేమో!

ఇలా అనుకుంటూ ఉండగానే రెండువందల గజాల దూరంలో ఒక చిన్న గుట్టమీద ముగ్గురు తార్తారులు కనిపించారు.

వాళ్ళుకూడా అతన్ని చూచారు. చూచిందే తడవుగా అతనిమీదికి పరుగెత్తుకు వస్తున్నారు. జిలిన్‌కు గుండె జారిపోయింది. నిరాశ, నిస్పృహ కలిగాయి. అయినా చేతులెత్తి బిగ్గరగా కేకలు వేశాడు. రష్యన్ సైనికుల్ని పిలుస్తూ! 'సోదరులారా? సోదరులారా!'

రష్యన్ సైనికులకు అతని పిలుపు అందింది. వెంటనే కొంతమంది గుర్రాలెక్కి దౌడు తీస్తూ వచ్చారు. జిలిన్ అయోమయావస్థలో ఉన్నాడు. అయినా చేతనైనంతవరకు రష్యన్ సైనికుల వైపు పరుగు పెట్టాడు; సోదరులారా! సోదరులారా! అని కేకలు పెట్టుకుంటూ.

రష్యన్ సైనికులు పదిహేనుమంది దూకుడుగా రావటం చూచి ఆ ముగ్గురు తార్తారులూ ఆగిపోయారు. రష్యన్ సైనికులు జిలిన్ చుట్టూ మూగారు. 'ఎవరు నువ్వు! ఎక్కడినించి వస్తున్నావు?' అని అడిగారు.

జిలిన్ కళ్ళ వెంట అశ్రువులు ప్రవహిస్తున్నాయి. 'సోదరు లారా! సోదరులారా!' అంటున్నాడు – అంతే.

రష్యను సైనికులంతా పోగైనారు. ఒకడు జిలినుకు రొట్టె యిచ్చి తినమన్నాడు. మరొకడు సారాయం పోసి తాగమన్నాడు. మరొకడు అతని కాళ్ళ సంకెళ్ళ పగల గొట్టాడు.

ఆ సైనికోద్యోగులతన్ని గుర్తించారు. తమ కోటలోకి తీసుకుపోయారు. జిలిన్ మళ్ళీ వచ్చినందుకు మిత్రులంతా సంతోషించారు. వాళ్ళందరికీ అతను తన కథంతా చెప్పాడు. 'అదీ, నేను ఇంటికి పోయి పెళ్ళి చేసుకున్న గాథ' అన్నాడు – అంతా చెప్పి.

జిలిన్ మళ్లీ తన నౌకరీలో ప్రవేశించాడు. తరువాత ఒక నెలకు కోస్టిలన్ ఐదు వేల రూబుల్సు చెల్లించుకుని తార్తారు పల్లెలోనుంచి బయటపడ్డాడు. అతడు తిరిగి కోటకు చేరుకునే సరికి చాల నీరసించి పోయాడు.



———